మే 2009 ■ Rs.20/-



# చందమామ




ఎన్నెన్నో మెగా బహుమతులు!

11

సిక్కిం దినోత్సవం

భూతలస్వర్గం!

26

పురాణ వీరకుమారులు

భరతుడు

MAHE...

సమ్మర్ స్పెషల్ పోటీల్లో పాల్గొనండి! ఐదు ల్యాప్‌టాప్‌లు గెలుచుకోండి!!




ఎమ్ఎమ్ఎమ్....పాపిన్స్!



Ram and Shyam




ఇన్ఫర్నోతో

పోరాటం






















GOLI RAINBOW-WALI



చందమామ సంపుటి: 62 మే 2009 సంచిక:05

## ఈ సంచికలో...





## ఈ నెల విశేషాలు















# సువర్ణ అవకాశం!

కావలసినంత తీరిక సమయం–మండుటెండలు చెట్టపట్టాలేసుకుని నడిచే వేసవి సెలవుల మధ్య ఉన్నాం. ఇప్పుడే చిన్నచిన్న పట్టణాల నుంచి మహానగరాల వరకు షార్ట్‌టర్మ్ క్రాష్ కోర్సులు, స్పోకెన్ ఇంగ్లీష్ తరగతులు, వ్యక్తిత్వ వికాస శిబిరాలు అంటూ లెక్కకు మిక్కిలిగా పుట్టుకు వస్తాయి.

బాలబాలికల నైపుణ్యాలను పెంపొందించడానికి ఇవన్నీ అవసరమే. వీటన్నిటితో పాటు ఈ సెలవులు కల్పించే అద్భుత అవకాశం మరొకటున్నది. అదే విద్యార్థులలో పఠనాసక్తిని పెంపొందించే సువర్ణ అవకాశం!

ఈ తరం విద్యార్థుల పుస్తక జ్ఞానం, వెనకటి తరం వారికన్నా విశాలమైనదనడంలో సందేహం లేదు. అయితే, ఆయా విషయాలలో లోతైన అవగాహన ఉంటుందా అంటే అనుమానమే. ఎందుకంటే మార్కుల కోసం సాగేవే ఈ చదువులు. సంవత్సరమంతా పాఠ్యపుస్తకాలతో కుస్తీ పట్టడానికే సరిపోతోంది. అలాంటి వారికి మంచి పుస్తకాలను చదివే తీరిక లభించేది సెలవుల్లో మాత్రమే.

దృశ్యమాధ్యమాల తాకిడితో పిల్లల్లో చదివే అలవాటు రోజురోజుకూ అడుగంటి పోతోందని వాపోయే పెద్దలున్నారు. ఆ మాట వాస్తవం కూడా. చదవడం వల్ల సమకూరే ఆనందాలను, ఒనగూడే ప్రయోజనాలను పిల్లలకు చవిచూపడానికి సెలవులు అనువైన సమయం.

మనసుకు ఉల్లాసం, మేధస్సుకు ఉత్తేజం కలిగించి మానవ జీవితానికి పరిపూర్ణతను సమకూర్చేది మంచి పుస్తక పఠనం. మంచి కథల పుస్తకం చదివినప్పుడు మన మనోనేత్రాల ముందు నూతన ప్రపంచాలు ఆవిష్కృతమవుతాయి. పాఠకుల ఊహాశక్తిని, సృజనాత్మకతను తట్టి లేపేవి మంచి రచనలు. అంతే కాదు; భావ వ్యక్తీకరణకూ, భాషను ఉపయోగించే మెళకువలు తెలుసుకోవడానికీ పుస్తకపఠనం ఎంతైనా ఉపకరిస్తుంది. అవి జీవిత చరిత్రలు, కథలు, కవితలు ఏవైనా కావచ్చు. ప్రపంచ మేధావులను, మహనీయుల ఆలోచనలను పరిచయం చేసి జీవితం పట్ల అవగాహనను పెంచి సంస్కృతీ సంపన్నులుగా తీర్చిదిద్దేవి మంచి పుస్తకాలు. అందుకే 'పుస్తకం హస్త భూషణం' అన్నారు మన పెద్దలు!

అలాంటి మంచి పుస్తకాలను చదివే అవకాశాన్ని జారవిడుచుకోకూడదు. సెలవులు ముగిసేలోగా కనీసం ఒకటి రెండు మంచి పుస్తకాలన్నా చదవాలన్న నిర్ణయం తీసుకుందాం. యేడాదికోసారి వచ్చే సదవకాశాన్ని సక్రమంగా వినియోగించుకుందాం!

సంపాదకుడు : ఎల్. సుబ్రమణ్యాన్





**Founded by B. Nagi Reddi and Chakrapani**

*Chairman :* B. Viswanatha Reddi (Viswam)
*Editor & Publisher :* L. Subramanyan
*Associate Editor :* A.R. balasubrahmanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* Jayapandian
*Asst. Editor-Copy & Pre-Production :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designers :* M. Nagaraj, B. Thirumal

*CIRCULATION TEAM :*
*Chennai :* **T N Ravi Shankar,** *National Sales Manager*, Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan,** *Manager-Circulation & Institutional Sales - South*, Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
*Mumbai :* **Rajendra K Jadhav,** *Asst. Manager-Circulation*, Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industry, Opp. State Bank of India, Near Police Station Cross Road, No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* **Sushil Sharma,** *Circulation Manager-North*, Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* **P. Murali,** *Asst. Circulation Manager -Karnataka* , Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* **Ananth Prakash,** *Circulation Manager-East*, Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* **Kalpesh Raval,** *Sales Officer-Circulation* Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Content Head - Online :* **Sowmya Bharadwaj**
email : online@chandamama.com
*Assistant Manager - Marketing :* **Vidhi Kumar**
email : marketing@chandamama.com
*Advertisement :*
email : sales@chandamama.com
*Subscription Queries:* L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
*Customer Cell :* A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com


# పాఠకుల లేఖలు



ఆకర్షణీయమైన ముఖచిత్రంతో, మురిపించే కథలతో, ముద్దొచ్చే బొమ్మలతో 'మార్చి' సంచిక ఆసాంతం ఆకట్టుకున్నది. ప్రజాసంక్షేమం ప్రభువుల బాధ్యత అనే చక్కని పాలనాసూత్రాన్ని 'హేమచంద్రుడి ప్రవర్తన'(బే.క) ప్రతిపాదిస్తే, దానధర్మాల పరమార్థాన్ని 'దొరికిన సొమ్ము' విడమరచి చెప్పింది. సంపదల పట్ల మాత్రమే దృష్టి నిలపకుండా ప్రజల పట్ల ఉపకార బుద్ధి కలిగి ఉండడమే పాలకులకు ప్రాథమిక అర్హత అనే సందేశాన్ని 'జాలరి రాజు' కథ ప్రబోధించింది. పరీక్షల్లో మార్కులు సాధించడమే కాకుండా జీవిత పరీక్షల్లో సైతం సమర్థతను సాధించాలనీ, అందుకు పెద్దల బాధ్యత ఎంతయినా ఉందనీ గుర్తు చేసిన సంపాదకీయం ప్రశంసనీయం. 'వార్తలలో బాలలు' పిల్లలకు స్ఫూర్తిదాయకంగా ఉంది. విజ్ఞాన వినోదాలు కలిగిన శీర్షికలను అందిస్తూన్న చందమామకు అభినందనలు. కార్టూన్లు, బాలగేయాలు, ప్రముఖులతో బాలల ముఖాముఖి శీర్షికలు పెడితే బాగుంటుంది.

–ఎం. వైశాలి, తిరుపతి

చందమామ పత్రిక చేతిలో ఉంటే నింగిలోని చందమామ చేతిలో ఉన్నట్టే. ఆ చందమామ లాగే ఈ చందమామ కూడా చిన్ననాటి నేస్తం కదా! అమృతంలో ముంచి తీసిన మల్లెమొగ్గలా 'పసి'వాడని పరిమళాలు వెదజల్లుతోంది మన చందమామ. కాలం ఎంత మారినా, ఎంత టెక్నాలజీ వచ్చినా అదంతా పత్రికను మరింత నాణ్యతగా తీసుకురావడానికే ఉపయోగించడం పత్రిక నిత్యనూతనానికి కారణం. పాత కొత్తల మేలు కలయిక కావడం వల్లనే చందమామ తరాల తరబడి పాఠకుల్ని అలరించగలుగుతోంది.

–వెంకటేష్, జనుపల్లి

చందమామ రెగ్యులర్‌గా చదువుతున్నాను. కానీ ఒకటే బాధ; కొరత. కథలేవీ? ఏవేవో ఇంగ్లీషు ట్రాన్స్‌లేషన్స్ వేస్తున్నారు! అవి అసలు నచ్చడం లేదు.

–బి. మోహనకుమారి, మదురవాయల్, చెన్నయ్

మీ అభిప్రాయాలను ఈమెయిల్ feedback@chandamama.com ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.





# తాటిచెట్టు-మర్రిచెట్టు

రామాపురంలో చదువు పూర్తిచేసిన సునందుడు కరివరదపురం వెళ్ళి, జమీందారు దివాణంలో మంచి ఉద్యోగం సంపాదించాలనుకున్నాడు. అది గమనించిన అతడి తండ్రి, ''అక్కడ మన ఊరి వాడయిన వీరబలుడు దివాణం కాపలాభటుడిగా ఉన్నాడు. నువ్వెళ్ళి అతణ్ణి కలువు. దివాణంలో పనిదొరికే మార్గం చెప్ప గలడు,'' అని సలహా ఇచ్చాడు.

సునందుడు బయలుదేరి సాయంకాలా నికి కరివరదపురం సమీపించాడు. ఆసరికి బాగా పొద్దు పోవడంతో, రాత్రికి ధర్మసత్రంలో బసచేశాడు. భోజనమయ్యాక సత్రం యజ మానితో మాటలు కలిశాయి. సునందుడు అక్కడికి వచ్చిన పని గురించి తెలుసుకున్న మీదట సత్రం యజమాని, ''నువ్వు చూస్తే బాగా చదువుకున్న వాడివిలా ఉన్నావు. దివాణంలో నీకు చదువుకు తగ్గ పెద్ద ఉద్యోగం అయితేనే బావుంటుంది. అందుకు మీ తండ్రిగారు చూడమన్న భటుడు వీరబలుడు నీకు సాయం చేయలేక పోవచ్చు. జమీం దారు ప్రధాన సలహాదారులలో ఒకడైన శంకర దత్తుడు కూడా మీ ఊరివాడే. ఈ విషయం మీ తండ్రి మరిచినట్టున్నారు. నువ్వు మొదట శంకరదత్తుణ్ణి కలువు. నీ పని సానుకూల మవుతుంది,'' అన్నాడు.

సునందుడికి సత్రం యజమాని మాటలు నచ్చాయి. ఉదయాన్నే లేచి, దివాణంవద్దకు వెళ్ళి శంకరదత్తుణ్ణి కలుసుకుని, తన గురిం చినవివరాలు చెప్పాడు. శంకరదత్తుడిముఖంలో ఎలాంటి భావమూ లేదు. ''చదువుకున్న వాళ్ళందరూ ఉద్యోగాల కోసం ఇక్కడికి వస్తూంటారు. అయినా ఇక్కడ ఉద్యోగాలు రాశిపోసి లేవన్న విషయం వాళ్ళకు తెలి యదు. నాకు తెలిసినంత వరకు ప్రస్తుతం

డా. గంగిశెట్టి శివకుమార్



ఉందని' చెబుతూండగా విన్నాను. నీకు అభ్యంతరం లేకపోతే కాపలా భటుడి ఉద్యోగంలో చేర్చుకోమని నీ గురించి ఆ కోశాధికారితో చెబుతాను,'' అన్నాడు.

సునందుడు అయిష్టంగానే అందుకు సరే అన్నాడు. వీరబలుడు కోశాధికారితో మాట్లాడి, సునందుడికి ఖజానా కాపలాభటుడి ఉద్యోగం ఇప్పించాడు. ఆ ఉద్యోగంలో చేరి, కష్టపడి పనిచేసే స్వభావం గల సునందుడు త్వరలోనే మంచి పేరు తెచ్చుకున్నాడు.

ఒకనాడు అర్ధరాత్రి దాటినా ఖజానా లెక్కలు తెమల లేదు. అధికారి తలపట్టుకుని కూర్చున్నాడు. చాలా సేపు దానిని గమనించిన సునందుడు ధైర్యం చేసి, ''అయ్యా, మీరేమీ అనుకోకుంటే నేనొకసారి ఆ లెక్కలు చూస్తాను,'' అన్నాడు వినయంగా.

''ఈ లెక్కలు నీకేమి తెలుస్తాయి?'' అన్నాడు అధికారి చులకనగా.

''అయ్యా, నేను గణితం చక్కగా నేర్చాను. ఒకసారి ప్రయత్నించి చూస్తాను,'' అన్నాడు.

అతడి మాటల్లో నమ్మకం కుదిరి, లెక్కల పుస్తకాన్ని అతడి చేతికిచ్చాడు అధికారి. సునందుడు అతి చాకచక్యంగా కొద్ది సేపట్లో ఖజానా లెక్కలను ఒక కొలిక్కి తెచ్చాడు. దానిని చూసి ఆశ్చర్యపోయిన అధికారి సునందుడి విద్యార్హతల గురించి తెలుసుకున్నాడు. అంత చదివి కాపలాభటుడి ఉద్యోగం చేయడం ఆయనకెంతో బాధ కలిగించింది.

వయోభారం మీద పడి ఖజానా లెక్కల పని అంతా తనే చూడలేక పోతున్నానని

దివాణంలో ఎలాంటి ఉద్యోగాల ఖాళీల్లేవు,'' అని చెప్పి సునందుణ్ణి వెళ్ళమన్నట్టు చూశాడు.

సునందుడు ఆశాభంగానికి గురైనప్పటికీ, కొంత సేపటికి తేరుకుని తండ్రి చెప్పిన భటుడు వీరబలుణ్ణి కలుసుకుని తను వచ్చిన సంగతి చెప్పాడు. వీరబలుడు అమితానందంతో, ''మన ఊరు వదిలి ఎన్నో ఏళ్ళయింది. నిన్ను చూస్తూంటే మన ఊరిని చూస్తున్నట్టున్నది,'' అంటూ ఊరి గురించీ, ఊళ్ళో వాళ్ళ గురించీ వివరాలడిగి తెలుసుకున్నాడు.

ఆ తరవాత, ''నువ్వు బాగా చదువుకున్నవాడివి. నీకు తగిన ఉద్యోగం నేను చూసి పెట్టలేనేమో! అయినా, మొదటే పెద్ద ఉద్యోగం దొరక్కపోవచ్చు. దొరికిన చిన్న ఉద్యోగంలో చేరి, ఆ తరవాత ఉన్నతికి ప్రయత్నించవచ్చు. కోశాధికారి 'ఖజానాకు రక్షణ పెంచవలసి

జమీందారుగారితో ఆ అధికారి అంతకు ముందే ఒకటికి రెండుసార్లు చెప్పి ఉన్నాడు. అందుకు జమీందారు, ''సరే, తగినవాణ్ణి చూడు. నీకు సహాయకుడిగా నియమిస్తాను,'' అని చెప్పి ఉన్నాడు. ఇప్పుడు అధికారి జమీందారుకు సునందుడి విషయం చెప్పి, ఆయన అనుమతి పొంది అతణ్ణి సహాయకుడిగా నియమించుకున్నాడు.

సునందుడు సంతోషంగా అధికారికి కృతజ్ఞతలు తెలియజేసి, తనకు దారి చూపిన వీరబలుడి వద్దకు వచ్చి, విషయం చెప్పి, ''అంతా మీ దయ. ఆరోజు మీరిచ్చిన ప్రోత్సాహమే దీనికంతా కారణం,'' అంటూ చేతులు జోడించాడు.

''నీ అర్హతనుబట్టి నీకా ఉద్యోగం వచ్చింది. నాదేముంది. అయినా ఒక ఊరివాళ్ళమై ఉండీ అంతమాత్రం చేయకపోతే ఉండి ప్రయోజనం ఏమిటి? సరే, ఈ విషయం మీ తండ్రికి తెలిస్తే సంతోషిస్తాడు. ఈ శుభవార్తను ఆయన చెవిన వేసిరా,'' అన్నాడు వీరబలుడు.

సునందుడు గ్రామంచేరి తండ్రికి తన ఉద్యోగం గురించి చెప్పి, మొదట శంకరదత్తుడితో కలిగిన చేదైన అనుభవం గురించి కూడా ప్రస్తావించాడు.

''అవును. శంకరదత్తుడు కూడా మన ఊరివాడే. అతణ్ణి చిన్నప్పటి నుంచీ ఎరుగుదును. అయినా, అతణ్ణి గురించి ఎందుకు చెప్పలేదనుకున్నావు? అతడు చేస్తున్నది గొప్ప ఉద్యోగమే. కాని ఇతరులకు సాయపడే గుణం లేదు. కొంత మంది జీవితంలో ఎంతో ఎదుగుతారు. కాని ఎదుటి వారికి కించిత్తయినా సాయపడరు. వీళ్ళ ఎత్తు తాటిచెట్టు ఎదుగుదల లాంటిది. ఎవరికీ నిలవ నీడనివ్వరు. అందుకే అతణ్ణి గురించి నీతో మాటమాత్రమైనా చెప్పలేదు. వీరబలుడు చేసేది చిన్న ఉద్యోగమే అయినా ఉపకార బుద్ధిగలవాడు. అతడు నీడనిచ్చే మర్రిచెట్టులాంటివాడు. అందుకే నిన్ను అతణ్ణి చూడమన్నాను. నువ్వు కూడా వీరబలుణ్ణి ఆదర్శంగా తీసుకుని ఇతరులకు చేతనైన సాయం చేస్తూ ఉండు,'' అన్నాడు తండ్రి చిన్నగా నవ్వుతూ.

తండ్రి లోకజ్ఞానానికి సునందుడు ఆశ్చర్యపోయాడు.



# స్వయంకృతం!

పుట్టి పెరిగిన రామాపురంలో బతకలేక రంగపట్నం చేరిన రఘునాధుడు ఒక కిరాణా దుకాణంలో పనిలోకి కుదిరాడు. అతడి భార్య ఇంటి వద్ద ఇడ్లీ అంగడి పెట్టింది. ఆలూమగలు కష్టపడి పని చేయడంతో రెండేళ్ళు తిరిగేసరికి రఘునాధుడు సొంతంగా చిన్న కిరాణాకొట్టు పెట్టాడు. మరో మూడేళ్ళు కష్టపడి చిన్న ఇల్లు కట్టుకున్నాడు.

గృహప్రవేశానికి ఊరి నుంచి వచ్చిన తమ్ముడు నాగభూషణుడు అన్న ఐశ్వర్యాన్ని చూసి అసూయతో కుతకుతలాడిపోయాడు. పైకి మెచ్చుకుంటున్నట్టు, ''ఐదేళ్ళలో ఇంత ఎలా సంపాదించగలిగావు?'' అని అడిగాడు.

''అంతా దేవుడి దయ. మన ఊళ్ళో ఉన్నంత వరకు పీడించిన దురదృష్టాన్ని ఇనుప పెట్టిలో బంధించి, పెరట్లోని వేపచెట్టు కింద పాతిపెట్టి వచ్చాను. శ్రమటోడ్చి పనిచేశాను,'' అన్నాడు రఘునాధుడు యథాలాపంగా.

ఇదా సంగతి అని ఊరు చేరిన తమ్ముడు ఆ రోజు రాత్రే, అన్న చెప్పిన వేపచెట్టు కింద తవ్వి పాత ఇనుప పెట్టెను పైకి తీసి తెరిచాడు. అందులో నుంచి వెలుపలికి దూకిన నల్లటి ఆకారంతో, ''మా అన్నయ్య రంగపట్నంలో ఉన్నాడు. అక్కడికి వెళ్ళు,'' అన్నాడు.

''నేను వెళ్ళను. అన్నాళ్ళు అంటిపెట్టుకున్న నా పట్ల ఏమాత్రం కృతజ్ఞత లేకుండా ఇక్కడ పాతిపెట్టి వెళ్ళిపోయాడు. నువ్వేమో నాకు చెర నుంచి విముక్తి కలిగించావు. నువ్వంటేనే నాకు ఇష్టం. ఇక నిన్ను వదలను,'' అంటూ అదృశ్యమయింది ఆ నల్లటి ఆకారం.

ఆ రోజు నుంచి తమ్ముణ్ణి దురదృష్టం బద్ధకం రూపంలో పట్టుకున్నది. అనుకోని అవాంతరాలు, అరిష్టాలు రాసాగాయి. ''అయ్యో, అసూయతో అన్నకు హాని తలపెట్టబోయి నేను కష్టాల పాలయ్యాను. చెరపకురా చెడేవు అన్న పెద్దల మాట నిజం!'' అంటూ అతడు వాపోసాగాడు. –ఉమా శ్రీధరన్



సిక్కిం దినోత్సవం

# భూతల స్వర్గం!



*Courtesy: Wikipedia.org, under the terms of the GNU Free Documentation License*

మండుటెండలలో క్రికెట్ ఆడుతూ, మామిడికాయలు రుచి చూస్తూ, వారంలో ఇది ఫలానా రోజు అని కూడా పట్టించుకోకుండా పిల్లలు ఆటపాటలతో ఆనందించే నెల మే.

సిక్కిం ప్రజలు ఈ నెలలో మరింత ఆనందం చెందడానికి మరో ముఖ్య కారణం ఉంది. మే పదహారు వాళ్ళకు చాలా ముఖ్యమైన రోజు. 1975వ సంవత్సరం ఆ రోజే వాళ్ళు రాచరిక వ్యవస్థ నుంచి బయటపడి ప్రజాస్వామ్యంలోకి అడుగుపెట్టారు. అందువల్ల ఆ రోజును 'సిక్కిం రాష్ట్ర దినం'గా కొనియాడుతున్నారు.

కొండలు, కోనలు, లోయలు, ఎటు తిరిగినా పచ్చటి చెట్టుచేమలు కనులవిందు చేసే సుందర ప్రాంతం సిక్కిం. ప్రకృతి సౌందర్యం నిండిన ఈ ప్రాంతం పర్యాటకులకు భూతల స్వర్గంలా కనిపిస్తుంది. బ్రహ్మాండమైన కాంచెంద్‌జంగాను సిక్కిం ప్రజలు అందమైన పర్వతంగా మాత్రమే భావించడం లేదు. తమకు శాంతి భద్రతలను, సంపదలను ప్రసాదించే కాపలా దైవంగా భావించి పూజిస్తారు. అద్భుత సుందర ప్రకృతి దృశ్యాల మధ్య నివసించే అక్కడి ప్రజల పండుగలు, ఉత్సవాలు కూడా ప్రకృతిని కేంద్ర బిందువుగా కలిగి ఉండడంలో ఆశ్చర్యం లేదు.

ముప్పైనాలుగేళ్ళ క్రితం ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడిన దరిమిలా సిక్కిం ప్రజలు తమ రాష్ట్రాన్ని ప్రతిరంగంలో అభివృద్ధిపరచి సుసంపన్నంగా తీర్చిదిద్దడానికి పట్టుదలతో కృషి చేస్తున్నారు. ''నా ప్రజలకు ద్రోహం తలపెట్టడం కన్నా మరణించడానికే సిద్ధపడతాను,'' అన్న ముఖ్యమంత్రి పవాన్ చామ్లింగ్ ప్రకటనలో ఆయన నిబద్ధత వ్యక్తమవుతుంది.

సిక్కింలో నివసించడమే ఒక ఎడతెగని ఆనందం; వేడుక అంటే అతిశయోక్తి కాదు. ప్రకృతితో తాదాత్మ్యం చెందాలంటే ఒకసారి సిక్కిం వెళ్ళి రావాలి. సిక్కిం దినోత్సవ శుభాకాంక్షలు!

# వేగ సూత్రం

ఈ నెల సమస్య:

మాయా తన దగ్గరున్న ప్యాకెట్‌మనీతో ఒక అనాథ శరణాలయంలో తన పుట్టినరోజును జరుపుకోవాలని నిర్ణయించింది. అదనంగా అయ్యే ఖర్చును తాతయ్య ఇస్తానన్నాడు. ఆ అనాథ శరణాలయంలో 32 మంది అమ్మాయిలు, 30 మంది అబ్బాయిలు ఉన్నారు.

ఒక్కో విద్యార్థికి భోజనం ఖర్చు రూ.40.

ఒక్కొక్క దానికీ పార్టీ హ్యాట్ రూ.10.

ఒక్కొక్క విద్యార్థికి మాయా కానుకగా ఇవ్వదలచిన కొయ్య పెన్సిల్‌హోల్డర్ ధర రూ.18.

ఇప్పుడు మాయా వద్ద రూ.3,000/- ఉన్నాయి. తాతయ్య ఎంత డబ్బు ఇవ్వవలసి ఉంటుంది?

మీ వేగసూత్రాన్ని మాకు పంపండి.

అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ.500/-

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగర్తై, చెన్నయ్-600041.

లేదా contests@chandamama.com కు ఈ మెయిల్ చేయండి.

గమనిక: ఈ సమస్యకు సంబంధించిన వేదగణిత సూత్రం జూన్ సంచికలో ప్రకటించబడుతుంది.

## చందమామ లోకజ్ఞానం క్విజ్-2(మార్చ్'09) సమాధానాలు:

1. జిఎంటి కన్నా 5 ½ గంటల ముందుంటుంది ఐఎస్‌టి 2. టిటికాకా(సముద్ర మట్టానికి 12,500 అడుగుల ఎత్తులో) మరియు డెడ్‌సీ(సముద్ర మట్టానికి 1,20,906 అడుగుల దిగువ) 3. సుందర్‌బన్స్, గంగ, బ్రహ్మపుత్ర 4. జూన్ 21 5. ఈజిప్టు రాజధాని కైరో 6. 177 కాలువలు 7. ఛేత్రి, రాజస్థాన్‌లో 8. త్రిపుర, బంగ్లాదేశ్

## చందమామ లోకజ్ఞానం క్విజ్-2(మార్చ్'09)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.

అందువల్ల బహుమతి ఇవ్వలేకపోతున్నాం.



# పాతాళదుర్గం

## 10

*[ధూమక సోమకులకు విరూపుడనే ఆటవికుడితో స్నేహం అయింది. అతడితో కలిసి వాళ్ళు ఒక నది దగ్గిర భిల్లనాయకుడు ఒకడితో పరిచయం చేసుకుని, తెప్పల మీద నది దాటుతూండగా, మంత్రదండాన్ని పాము అని భ్రమపడి ఒక పెద్ద గరుడపక్షి వచ్చి తన్నుకుని, ఆకాశంలోకి లేచింది. విరూపుడు తన దగ్గిరున్న పొడవాటి తాడును గరుడపక్షికి గురిచేసి విసిరాడు. -తరవాత]*

విరూపుడు విసిరిన తాటి ఉచ్చు గరుడపక్షి రెక్క కొకదానికి తగులుకున్నది. అదే అదనుగా విరూపుడు తాడును బలంగా కిందికి గుంజాడు. పక్షివేగంగా పైకి పోతూండటంతో ఉచ్చు గట్టిగా బిగుసుకుపోయింది. గరుడపక్షి ఒక్క తృటికాలం గాల్లో కదలకుండా వుండిపోయి, అంతలోనే కర్ణకఠోరంగా అరుస్తూ, రెక్కల్ని బలంగా ఆడించి పైకెగరబోయింది. విరూపుడు రెండు చేతులతో తాడును గట్టిగా కిందికి లాగుతూ, తెడ్లు వేసే భిల్లులను కూడా సహాయం రమ్మని కేక వేశాడు. వాళ్ళు తెడ్లు వదిలి విరూపుణ్ణి సమీపించేసరికి రెచ్చిపోయిన గరుడపక్షి అతణ్ణి తెప్ప మీది నుంచి ఒకటి, రెండడుగులు గాల్లోకి లేపింది.

''విరూపా! తాడు వదలకు. నేనుకూడా వస్తున్నాను,'' అంటూ సోమకుడు పెద్దగా అరిచి, తన తెప్పతో, విరూపుడి తెప్పను

'చందమామ'



పాటు విరూపుడూ, ఇద్దరు భిల్లులూ నీట పడ్డారు. ఆ ఇద్దరూ ఈత తెలిసినవాళ్ళయినా ప్రవాహవేగానికి భయపడి, మునిగిపోతున్నా మంటూ కేకలు పెట్టసాగారు. విరూపుడు నీటి వాలుకు కొట్టుకుపోతున్న తెప్పను నాలుగు బారలు వేసి అందుకుని, ''భిల్లులు ఇంత పిరికి సన్నాసులనుకోలేదు. ఇదుగో, తెప్ప ఎక్కండి,'' అని అరిచి, ''సోమక బాబూ! మీరు ధూమక దొర దగ్గిర కెళ్ళండి. నేను ఈదగలను. ఇంత కష్టానికీ కారణం అయిన నల్ల గరుడపక్షి ఉచ్చులోంచి బయట పడ కుండాపట్టుకోవాలి. దాని గుండెకాయ కాల్చుకు తినందే నా పగ తీరదు,'' అంటూ దాని కేసి ఈదుకు పోయాడు.

సమీపించాడు. ఆ సరికి గరుడపక్షి బలం క్షీణించింది. ముగ్గురు బలశాలులు తాడును కిందికి గుంజుతూండటంతో, అది ఆకాశంలో ఒకపక్కకు ఒరిగి రెక్కలను టపటపలాడిస్తూ కింద పడసాగింది. ధూమకుడు కత్తిదూసి పక్షి మెడకు గురిచేసి బలంగా విసిరాడు. ఆ దెబ్బ గురితప్పి దాని గుండెల మీద తగిలింది. దానితో అది, మంత్రదండాన్ని వదిలి విలవిల కొట్టుకుంటూ నదిలో వచ్చి పడింది.

సోమకుడు పరమానందుచెంది, ''ధూమూ, భయంలేదు, తెప్ప తెస్తున్నాను,'' అంటూ ఒక కేక పెట్టి, ధూమకుడు నదిలో పడిన చోటుకు తెప్పను నడిపించాడు. ఈ లోపల విరూపుడి తెప్ప మీద వున్న గుర్రాలు రెండూ బెదిరి తెప్ప మధ్యనున్న ఒక చివరకు పరిగెత్తటంతో, అది తల్లకిందులైపోయి నీళ్ళలో పడింది. వాటితో

సోమకుడు తన తెప్పతో ధూమకుణ్ణి సమీపించగానే, అతడు తెప్ప అంచు పట్టు కుని దాని మీదికి ఎక్కి కూర్చున్నాడు. నీట పడిన భిల్లులిద్దరూ మళ్ళీ తమ తెప్ప ఎక్కి విరూపుడి కేసి దాన్ని నడిపారు. ఈ లోపల విరూపుడు గరుడపక్షిని చేరి, దాని మెడ పట్టుకోబోయేంతలో, అది కాళ్ళతో అతణ్ణి ఒక్క తన్ను తన్నింది. వాడి అయిన దాని గోళ్ళు శరీరానికి తగిలేసరికి విరూపుడికి ఎక్కడలేని రౌద్రం వచ్చి, ముందూ వెనుకలు చూడకుండా దానిమీదికి ఎగిరి కలియబడ్డాడు. ఆకాశంలో తిరిగే పక్షికీ, నేల మీద నడిచే మనిషికీ నీటిలో జరుగుతున్న చావుబతుకుల పోరాటం చూసి, ధూమక సోమకులు చాలా అబ్బురపడ్డారు.

''ఏ మొసలో చూసిందంటే ఇద్దర్నీ ఒక గావు పట్టుపట్టి మడుగులో ఉన్న తన

సొరంగంలోకి లాక్కుపోతుంది. తెప్పల్ని త్వరగా విరూపుడి కేసి నడపండి,'' అని ఆజ్ఞాపించాడు ధూమకుడు.

క్షణంలో తెప్పలు రెండూ విరూపుణ్ణి సమీపించాయి. ఆ సరికి అతడు ఒక చేత్తో గరుడపక్షిమెడ విరిచి పట్టుకుని, రెండవ చేత్తో దాని కాళ్ళను గుప్పెట బిగించేందుకు నా నా ప్రయాసా పడుతున్నాడు. తెప్ప అతణ్ణి సమీపించగానే ధూమకుడు, ''విరూపా! నువ్వు తెప్ప మీదికి రా. ఉచ్చులో దొరికిన పక్షి ఎక్కడికి పోతుంది?'' అంటూ అతడి భుజాలు పట్టుకుని బలమంతుగా తెప్ప మీదికిలాగాడు. విరూపుడి శరీరంలో చాలా చోట్ల పక్షి గోళ్ళు తగిలి గాయాలయినాయి. ధూమకుడూ, సోమకుడూ కలిసి గరుడపక్షిని తెప్ప మీదికి చేర్చారు.

''ఇది గరుడపక్షి కాదు, ఏదో రాక్షసుడని నా అనుమానం!'' అన్నాడు సోమకుడు పక్షి కేసి కత్తి ఝుళిపిస్తూ.

''దొరా, ఇంతకన్నా భయంకరంగా ఉన్న పక్షులు ఈ కొండ ప్రాంతాల్లో వున్నవి. మేం అప్పుడప్పుడూ వీటి కోసం ఉచ్చులు వేసి పట్టుతూంటాం. మా వాళ్ళల్లో కొందరు చిన్న పిల్లలుగా వుండగానే వీటిని పట్టుకుని పెంచుతూంటారు. అలవాటు చేస్తే వేటలో సహాయంగా వుంటుంది.'' అన్నాడు విరూపుడు గరుడపక్షి కేసి ప్రేమగా చూస్తూ.

ధూమకుడు ఆ మాటలకు పెద్దగా నవ్వి, ''దాని గుండెకాయ తీసి కాల్చుకు తింటాను అన్న నీ ప్రతిజ్ఞ ఏమయింది? ఒళ్ళు చూసుకున్నావా, ఎన్ని గాయాలయినయో, ఎంత రక్తం కారిందో?'' అన్నాడు.





వెళ్ళాడు. ఈ లోపల ధూమకుడు తన తడిసిన బట్టలను పిండుకుని ఆరపెట్టుకోసాగాడు.

ఒక పావు గంట గడిచింది. హఠాత్తుగా విరూపుడు చెట్లచాటు నుంచి, ''దొరా, దొరా! ఘోరం జరిగిపోయింది,'' అంటూ ఒక పావుకోడు చేతబట్టుకుని ధూమకుడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చాడు.

''ఇది కాలశంబర మాంత్రికుడి పావుకోడు, అవునా?'' అన్నాడు ధూమకుడు.

''అవును, దొరా. నాకు బాగా గుర్తు. ఆ దొరకేదో ప్రమాదం జరిగింది. కుంభీరుడనే రాక్షసుడు ఆయన శత్రువన్నారే-వాడు ఆయన్ని చంపేసి వుంటాడని నా అనుమానం,'' అన్నాడు విరూపుడు భీతి చెందినవాడిలా.

''కాలశంబర మాంత్రికుడు అంత తేలిగ్గా చచ్చేరకం కాదు. రాక్షసుడైనా, కుంభీరుడు అంత దుర్మార్గుడేం కాదు. వాడి మాటల ధోరణీ, ప్రవర్తనా నేను చూశాను. కానీ.. మొత్తం మీద మాంత్రికుడి కేదో ప్రమాదం జరిగింది. అందులో సందేహానికి తావు లేదు,'' అన్నాడు ధూమకుడు.

విరూపుడు ఏమో చెప్పబోయేంతలో సోమకుడు, ''ధూమూ, త్వరగా ఇటురా?'' అంటూ కత్తిదూసి దగ్గిరలో వున్న పొదల కేసి బయలుదేరాడు. గుర్రాల్లో ఒకటి ముక్కులు పెద్దవి చేసి, వెనుక కాళ్ళమీద నిలబడి, సోమకుడి కళ్ళెం తాడు పట్టు నుంచి విడిపించుకోవాలని చూస్తున్నది.

ధూమకుడూ, విరూపుడూ గబగబా సోమకుడున్న చోటుకు పరిగెత్తారు. సోమకుడు

విరూపుడు గాయాల కేసి చూసుకుని, ''నది దాట నివ్వండి దొరా. ఈ గాయాలు నిమిషాల మీద నయం చేసుకుంటాను,'' అన్నాడు.

ఈ లోపల భిల్లులు తెడ్లు వేసి రెండు తెప్పలనూ అవతలి ఒడ్డుకు చేర్చారు. నదిలో పడి ఈదుకు పోయిన గుర్రాలు రెండూ, నది ఒడ్డున ఉన్న చెట్లకింద నిలబడి సకిలిస్తున్నవి. ''బతికిపోయాం. రెండూ మహారణ్యంలోకి పారిపోలేదు, నయం,'' అంటూ సోమకుడు వాటిని సమీపించి పట్టుకుని, దాపుల నున్న పచ్చిక దగ్గిరికి తీసుకుపోయాడు.

విరూపుడు, గరుడపక్షిని ఉపాయంగా తెప్ప మీంచి ఒడ్డుకులాగి, తాడు కొసను ఒక చెట్టుకు కట్టి, తన గాయాలకు ఆకు పసరు పూసుకునేందుకు అక్కడ వున్న పొదల కేసి

పొదల కేసి చూపిస్తూ, ''వాటి వెనక నుంచి మూలుగులో, మాటలో వినబడుతున్నవి. మొదట్లో నేను గుర్తించలేదు. గుర్రం భయపడిపారిపోవాలని చూస్తుంటేనాకు అనుమానం కలిగింది,'' అన్నాడు.

ధూమకుడు కత్తిదూసి, ''జై కాళేరమ్మా!' అంటూ పొదల్లోకి జొరబడ్డాడు. అతడి వెనకనే, ''శాంభవీ'', అని కేక పెడుతూ విరూపుడు వెళ్ళాడు.

''అయ్యా, చస్తున్న వాడి మీద కత్తీకటారు లెత్తుతారెందుకు? నేను రాక్షసుణ్ణి కాదు.. అట్లని మనిషినీ కాదు. పాతికేళ్ళ, కాలకలి రాక్షసుడి చెర నాకు ఈ రెండూ కాని మరేదో వికారరూపాన్నిచ్చింది,'' అన్న మాటలు వినిపించాయి.

ఆ మాట్లాడిన వాడి ఆకారవిశేషాలు చూసి ముగ్గురూ దడుచుకున్న వాళ్ళలా ఆగిపోయి, ఒక్కొక అడుగే వెనక్కు వేయసాగారు. మిడిగుడ్లూ, బట్టతలా, అక్కడక్కడా సూదుల్లా నిలబడి వున్న వెంట్రుకలూ చూస్తే, ఆ మనిషి మాట్లాడే శవంలా వున్నాడు. అతడి శరీరం మీద బలంగా తగిలిన గాయాల గుర్తులు కనబడుతున్నవి.

''ఆ పావుకోడెవరిది? ఆ మంత్రదండం ఎవరిది? ఆ రెండూ కాలశంబర మాంత్రికుడివేనా?'' అని ప్రశ్నించాడు, ఆ వికారాకారుడు ఆయాసపడుతూ.

''అవును, కాలశంబరుడివే! నువ్వెలా గుర్తించగలిగావు? నువ్వెవరివి?'' అని అడిగాడు ధూమకుడు.



''ఇప్పుడో ఇంకాసేపటికో చావనున్న నేనెవరినైతే మాత్రం మీకేం? ఒకప్పుడు నే నీ ప్రాంతాలవాణ్ణే. కాలకలిరాక్షసుడి బంట్లకు దొరికి పాతికేళ్ళుగా వాడి చెర అనుభవించాను. వాళ్ళు నాకు ప్రాణ భయం పెట్టి, ఈ ప్రాంతాలవాణ్ణి గనక ఇక్కడ మనుషుల్ని ఎత్తుకు పోవడానికి వచ్చినప్పుడల్లా, దారిమార్గం చూపేందుకు నన్ను వెంటబెట్టుకు వచ్చేవాళ్ళు. ఇప్పుడూ ఆ పని మీదే నన్ను వెంట తెచ్చారు. పారిపోవాలని ప్రయత్నించాను, ఫలితం ఈ గాయాలు!'' అంటూ వికారాకారుడు ఆయాసపడసాగాడు.

అతడు మరెంతో సేపు బతకడన్న అనుమానం కలిగినధూమకుడు, అతణ్ణిసమీపించి, ''మేం ఆ కాలకలి మీదపగ తీర్చుకునేందుకు వెళుతున్నాం. అతణ్ణి హతమార్చి నీ ఆత్మకు

శాంతి కలిగిస్తాం. ఈ ఒక్క మాటకు జవాబు చెప్పు; కాలశంబరుణ్ణి ఆ రాక్షసుడి బంట్లు పట్టుకుని చంపారా?'' అని అడిగాడు.

''ఆ సంగతి నేను నమ్మకంగా చెప్పలేను. అతడూ, అతడి వెంట వున్న ఒక యువకుడూ, ఆ దుర్మార్గుల్ని ఎదిరించి పోరాటం సాగించారు. ఆ గందరగోళంలో నేను తప్పించుకుని పారిపోయేందుకు ప్రయత్నించాను. నన్ను కత్తులతో పొడిచి ఇక్కడ పారవేశారు,'' అన్నాడా వికారాకారుడు.

''ఆ క్రూరులు ఎటుగా పోయారో చెప్పగలవా?'' అన్నాడు ధూమకుడు.

''చెప్పలేను, కానీ.. వాళ్ళు ఎక్కి వచ్చిన పడవ నది కొండమలుపు తిరిగే రేవులో ఉన్నది. మీరు వాగ్దానం చేసినట్టు, ఆ కాలకలిని చంపి నా ఆత్మకు శాంతి కలిగించండి,'' అంటూ వికారాకారుడు నిలువెల్లా ఓసారి కంపించి, కట్టెలా బిగదన్నుకుపోయాడు.

ధూమకుడు తన దగ్గిరున్న వస్త్రాల్లో ఒక దాన్ని అతడి శరీరం మీద కప్పి, ''విరూపా! నీ కితడు చెప్పిన నది మలుపు తెలుసునా?'' అని అడిగాడు.

''తెలుసుదొరా! అది ఎంతో దూరం కూడా లేదు, బయలుదేరండి,'' అన్నాడు విరూపుడు.

గుర్రాలను జాగ్రత్తగా చూస్తూండమని భిల్లులకు చెప్పి ముగ్గురూ నది మలుపు కేసి బయలుదేరారు. నాలుగైదు నిమిషాలు గడిచే సరికి వాళ్ళకు కొండను చుట్టి పోతున్న నదీ, అక్కడ రేవులా వున్న ఒక ప్రదేశంలో పెద్ద పడవా కనిపించింది. వాళ్ళు చెట్ల చాటున దాక్కుంటూ ముందుకు పోయి, రేవును సమీపించగానే, దాని ఒడ్డు నున్న చెట్లు ఎక్కి పడవ కేసి పరీక్షగా చూశారు. పడవ మీద ఎవరూ లేరు. కానీ, పడవ చుట్టూ ఎన్నో మొసళ్ళు ఈదుతూ కనిపించినై. ''సోమూ! బాణం గురిపెట్టి ఒక దాని శిరస్సు బద్దల య్యేలా కొట్టు,'' అన్నాడు ధూమకుడు.

సోమకుడు బాణం గురిపెట్టి వదలబో యేంతలో విరూపుడు, ''దొరా!'' అంటూ ఏదో చెప్పబోయాడు. కానీ, ఈ లోపలే సోమకుడు వదిలిన బాణం రివ్వుమంటూ పోయి, ఒకమొసలి తలను తాకింది. మొసలి నీళ్ళల్లో అంత ఎత్తున ఎగిరి పడి మనిషిలా కీచుమంటూ అరిచింది. -(ఇంకాఉంది)





# చండశాసనుడు!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, ''రాజా, ఏ దుర్మార్గుడికి ఎలాంటి కఠినశిక్ష విధించాలన్న నిర్ణయంతో అపరాత్రి వేళ నువ్విలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, తీరా శిక్షించే సమయం సమీపించినప్పుడు ఇదే నిర్ణయంతో ఉండగలవా లేదా అన్న అనుమానం మాత్రం కలుగుతున్నది. ఎందుకంటే తన అధికారానికే ఎసరు పెట్టి, అసంబద్ధమైన తీర్పులతో తన శాసనాలను ధిక్కరించిన దుండగుణ్ణి శిక్షించాలని బయలుదేరిన చండ శాసనుడైన ఒక రాజు, తీరా వాడు పట్టుబడనున్న సమయంలో తన



నిర్ణయాన్ని మార్చుకుని వెనకడుగు వేశాడు. నీకు తగు హెచ్చరికగా ఉండగలందులకు ఆ రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వజ్రగిరి రాజు రాజశేఖరుడు చండశాసనుడు. ప్రజాక్షేమం కాంక్షించి తరతరాలుగా వస్తున్న కఠినమైన శాసనాలను అమలు పరచడంలో అమిత జాగ్రత్త వహించేవాడు. ఇంత చేసినప్పటికీ రాజ్యంలో తరచూ చిన్నా పెద్దనేరాలు జరుగుతూనే ఉండడం అయనకు అమితాశ్చర్యం కలిగించేది.

రాజధానీ నగరాన్ని ఆనుకుని ఉన్న రామగిరి కొండకు ఆవలనున్న గునుకురాయి గ్రామంలోని ఐదుగురు యువకులు రోజూ మేకలను మేతకు అడవికి తోలుకుని వెళ్ళే వాళ్ళు. మేకలను మేతకు తోలేసి చెట్టు నీడన చేరే వాళ్ళు. ఆ ఐదుగురిలో ఒకడు పల్లె పదాలు చక్కగా పాడేవాడు. రెండోవాడు వేణువును ఊదడంలో దిట్ట. మూడోవాడు చతురోక్తులు విసురుతూ నవ్వించేవాడు. నాలుగోవాడు మూలికా వైద్యంలో అందెవేసిన చెయ్యి. ఐదోవాడు సుదర్శనుడు అనుకరణ విద్యలో ఆరితేరినవాడు. గ్రామ పెద్దల నుంచి మహారాజు వరకు అందరి మాటలనూ, హావభావాలనూ అనుకరించి స్నేహితులను ఆనందాశ్చర్యాలలో ముంచెత్తేవాడు.

ఒకనాడు ఒక మేక గుట్టమీదికి వెళ్ళి కనిపించకుండా పోయింది. కాపరులు దాని కోసం వెతుక్కుంటూ వెళ్ళారు. అది గుట్ట మీది రెండు పెద్ద బండల మధ్య ఉన్న సన్నటి ఖాళీలో ముందుకాళ్ళను వదిలేసి, పైకి తీయలేక అరిచి అరిచి అలిసిపోయింది. మిత్రులు అక్కడికి చేరి కష్టపడి ఒక బండను పక్కకు తోసి మేకను కాపాడారు.

అదే సమయంలో ఆ బండకు దిగువ వాళ్ళకో సొరంగమార్గం కనిపించింది. వాళ్ళు ఉత్సాహంగా అందులోకి దిగి ముందుకు నడిచారు. కొంతసేపటికి వాళ్ళు రాజభవనంలో పైకితేలారు. ఆపత్సమయంలో రాజకుటుంబీకులు తప్పించుకోవడానికి ఏర్పాటు చేసుకున్న రహస్య సొరంగమార్గం అది!

రాజు శయనమందిరంలో లేడుగాని, అక్కడున్న ఆయన చిత్రపటాన్ని చూసి మిత్రులు ఆశ్చర్యానికి లోనయ్యారు. ఆ చిత్రపటాన్ని చూస్తుంటే వాళ్ళలో ఒకడైన సుదర్శనుడికి రాజుగారి వేషం వేసినట్టున్నది!

గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళిన మార్గం గుండానే వెనక్కు తిరిగి వచ్చిన ఐదుగురు మిత్రులు ఆ సంగతి గురించి వేరెవ్వరికీ చెప్ప లేదు. అయితే, దాన్ని గురించి తమలో తాము పదే పదే చర్చించుకోసాగారు. అప్పుడు సుదర్శనుడు కనీసం ఒక్క రోజైనా రాజుగా ఉండాలన్న తనమనసులోని చిరకాల వాంఛను మిత్రుల ముందుంచాడు. అతడి కోరిక విని మిత్రులు మొదట దిగ్భ్రాంతి చెందారు. నిప్పుతో చెలగాటమని భయపడ్డారు. అయినా సుదర్శనుడి సమయస్ఫూర్తినీ, తెలివితేటలనూ ఎరిగిన వారు కావడంతో అతడి కోరికకు చెవియొగ్గారు.

ఆ తరువాత ఒకనాటి అర్ధరాత్రి సమయంలో ఐదుగురు మిత్రులూ రహస్య మార్గం గుండా మహారాజు శయనమందిరంలోకి ప్రవేశించారు. గాఢ నిద్రలో ఉన్న రాజు ముక్కుకు ఏదో ఆకు పసరు వాసన చూపి, ఆయన్ను అలాగే పక్కగదిలోకి చేర్చారు. సుదర్శనుడు రాజుగారి దుస్తులు, ఆభరణాలు ధరించి, రాజుగారి పాన్పుపై పడుకున్నాడు. తక్కిన నలుగురు మిత్రులూ వచ్చిన దారినే తిరిగి వెళ్ళారు.

తెల్లవారాక మహారాజు వేషంలోని సుదర్శనుడు దర్బారులో కొలువుతీరాడు. ఒకే రూపం, అనుకరణ ప్రతిభ, సమయస్ఫూర్తి ఉన్నందువల్ల సుదర్శనుడి పట్ల ఏ ఒక్కరికీ అనుమానం కలగలేదు. కొంత సేపటికి రక్షక భటులు, ధనికవర్తకుడు కూర్మావతారం ఇంట్లో దొంగతనం చేశాడన్న నేరంమోపి గళిబిలయ్యను సభలోకి లాక్కువచ్చారు.



''దొంగతనం చేశావా?'' అని అడిగాడు రాజు వాణ్ణి పరిశీలనగా చూస్తూ.

''చేశాను, ప్రభూ!'' అన్నాడు గళిబిలయ్య.

''దొంగతనానికి శిక్ష ఏమిటో తెలుసా?'' అని అడిగాడు రాజు.

''దొంగతనాన్ని బట్టి, జైలు శిక్ష నుంచి చేతులు నరికే వరకు,'' అన్నాడు గళిబిలయ్య.

''శిక్ష పడుతుందని తెలిసీ దొంగతనం ఎందుకు చేశావు?'' అని అడిగాడు రాజు.

''వారం రోజులుగా కూలిపనులు దొరక లేదు. భార్యాబిడ్డల ఆకలిబాధ చూసి భరించ లేక ఈ దొంగతనానికి పాల్పడ్డాను,'' అన్నాడు గళిబిలయ్య.

''నేరం చెయ్యడమే కాకుండా దానికి న్యాయం కల్పిస్తున్న ఈ దుర్మార్గుణ్ణి కఠినంగా శిక్షించండి, ప్రభూ,'' అన్నాడు కూర్మావతారం.



గురవయ్య వరహాలయ్య వద్ద చేసిన వంద వరహాల బాకీ ఇప్పుడు వడ్డీతో కలిపి మూడు వందల వరహాలయింది. గడువు తీరినా గురవయ్య బాకీ తీర్చలేదు. అదీ అతడి మీది అభియోగం.

అంతా విన్న రాజు తల పంకించి, ''గురవయ్య సకాలంలో బాకీ చెల్లించకపోవడానికి కారణం లేకపోలేదు. రేయింబవళ్ళు రెక్కలు ముక్కలు చేసుకున్నా పూటగడవని పరిస్థితి అతడిది. అయితే, వడ్డీ వ్యాపారివైన నువ్వు మేడలపై మేడలు నిర్మించావు. అందుకు నువ్వు శ్రమించిందంటూ ఏమీ లేదు. శ్రమించే వాళ్ళను దోచుకునే విద్య నీకు వెన్నతో బెట్టినది. వెంటనే గురవయ్య ఋణపత్రం చించి అవతల పారెయ్. లేకుంటే కటకటాలు తప్పవు,'' అన్నాడు రాజు వరహాలయ్యతో.

ఆ తరవాత భటులు బసవాచారి అనే వైద్యుణ్ణీ, మంగమ్మ అనే వితంతువునూ ప్రవేశపెట్టారు.

వెయ్యి వరహాలు ఇచ్చినట్టయితే, మంగమ్మ భర్త వ్యాధి నయం చేస్తానని చెప్పి వైద్యుడు బసవాచారి, మంగమ్మ వద్ద ఐదు వందల వరహాలు పుచ్చుకున్నాడు. చికిత్స ఫలించక మంగమ్మ భర్త చనిపోయాడు. అయినా తనకు చెల్లిస్తానన్న మొత్తం చెల్లించి తీరాల్సిందేనని వైద్యుడు న్యాయస్థానాన్ని ఆశ్రయించాడు.

''రోగం నయం చేస్తానని ముందుగానే డబ్బడిగావు. నీ వైద్యం పనిచెయ్యక రోగి మరణించాడు. అయినా నీ రుసుం చెల్లించాలని పట్టుబట్టడం పరమ కిరాతకం!'' అన్నాడు రాజు.

''ఆకలి బాధ అన్ని రోగాల కన్నా బాధాకరమైనది. దానిని భరించలేక గళిబిలయ్య నీ ఇంట్లో దొంగతనానికి పాల్పడ్డాడు. నీది అపారమైన ఆస్తి. అందులో గళిబిలయ్య దొంగిలించింది వంద వరహాలు మాత్రమే. అందుకు అతణ్ణి పట్టి కట్టేసి, నౌకర్ల చేత చితక కొట్టించి, ఆ తరవాత రక్షక భటులకు అప్పగించావు. ఆ విధంగా నువ్వే నేరస్తుడివి. గళిబిలయ్యకు రెండు వందల వరహాలు చెల్లించు,'' అని తీర్పునిచ్చాడు రాజు.

మంత్రి ఏదో చెప్పడానికి లేవబోతే, ''నా తీర్పుకు తిరుగులేదు. నెరవేర్చడమే తమ బాధ్యత,'' అన్నాడు రాజు చెయ్యెత్తి.

తరవాత వరహాలయ్య అనే వడ్డీ వ్యాపారినీ, గురవయ్య అనే పేద రైతునూ విచారణకు తీసుకు వచ్చారు భటులు.

‘‘ప్రభూ! నేను పేదలకు ఉచితంగానే వైద్య సేవ చేస్తున్నాను. ఉన్న వాళ్ళ నుంచి ఔషధం తయారీలకయ్యే మొత్తాన్నయినా రాబట్టుకోవాలి కదా?’’ అన్నాడు బసవాచారి.

‘‘నీ మాయమాటలు నా దగ్గర చెల్లవు. మంగమ్మ భర్త వైద్యానికని చెల్లించిన ఐదు వందల వరహాలను ఆమెకు తిరిగి చెల్లించు. లేకుంటే జైలు శిక్ష తప్పదు,’’ అన్నాడు రాజు.

దాంతో ఆ రోజు సభ ముగిసింది. అంతఃపురానికి చేరిన సుదర్శనుడు తన చిరకాల వాంఛ నెరవేరినందుకు పరమానందపడి, రాజు వేషం తీసేసి మరో కంటికి తెలియకుండా రహస్య మార్గం గుండా అడవికి తిరిగి వెళ్ళి మిత్రులను కలుసుకున్నాడు.



మరునాడు తెల్లవారుతూండగా అసలు రాజు రాజశేఖరుడికి మెలకువ వచ్చింది. ఏం జరిగిందో తెలియక సతమతమయ్యాడు. మంత్రితో సమావేశమయ్యాక, ఎవరో తనలా నటించి, సింహాసనాధిష్ఠుడై తీర్పులిచ్చాడని గ్రహించి అమితాగ్రహం చెందాడు.

ఆ దుర్మార్గుణ్ణి పట్టి శిరశ్ఛేదం చెయ్యాలని నిర్ణయించాడు. అంత వరకు ఆ విషయాన్ని గోప్యంగా ఉంచమని మంత్రిని ఆదేశించాడు.

మరునాడే నకిలీ రాజు ఆచూకీ కనుగొనడానికి రాజూ, మంత్రీ మారువేషాల్లో బయలుదేరారు. మార్గమధ్యంలో రచ్చబండ వద్ద కూర్చున్న పెద్ద మనుషులు కొందరు రాజు గారి తీర్పును తెగమెచ్చుకోవడం వాళ్ళ చెవిన పడింది. మహారాజులో ఇంత మంచి మార్పు వచ్చినందుకు వాళ్ళు సంబరపడిపోతున్నారు. మహారాజు పదికాలాల పాటు క్షేమంగా ఉండాలంటూ గ్రామ దేవతలకు పొంగళ్ళు పెట్టి మొక్కుకుంటూన్న స్త్రీలు కనిపించారు.

రెండు రోజుల తరవాత అడవి సమీపంలో ఐదుగురు మేకల కాపర్లు సభ జరపడం వాళ్ళ కంటపడింది. అందులో రాజు రూపురేఖలు గల ఒక యువకుడు రాజులాగే తీర్పులిస్తున్నాడు. ఒకరోజు రాజుగా నటించిందెవరో మహారాజుకు తెలిసిపోయింది. వాణ్ణి కొంత సేపు తదేకంగా చూసిన రాజు, మందహాసం చేశాడు. వాణ్ణి అభినందించాలి తప్ప, శిక్షించడం భావ్యం కాదని భావించి ఏమీ జరగనట్టు మౌనంగా వెనుదిరిగాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ‘‘రాజా, అనామకుడైన ఒక మేకల కాపరి రహస్యంగా రాజ భవనంలోకి ప్రవేశించి, మహారాజుకు మత్తు

మందిచ్చి, ఆయన వేషం ధరించి ఒక రోజంతా సింహాసనం అధిష్ఠించి, శాసనాలను ఉల్లంఘించి తనకు తోచిన తీర్పులివ్వడం క్షమార్హంకాని ఘోరనేరాలు కావా? దుందుడుకు చర్యలకు పాల్పడ్డ ఆ దుర్మార్గుణ్ణి కఠినంగా శిక్షించని రాజశేఖరుడు రాజెలా అవుతాడు? ఆయనలో వచ్చినహఠాత్‌పరిణామానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఒక రోజైనా రాజు కావాలన్నది సుదర్శనుడి చిరకాల వాంఛ. అది నెరవేరే అవకాశం అనుకోకుండా లభించడంతో పర్యవసానాల గురించి ఆలోచించకుండా కార్యాచరణకు దిగడం దుందుడుకు తనమే. అందులో సందేహం లేదు. అయితే, అతనికి రాజ్యాధికారాన్ని చేపట్టాలనే కోరిక ఏ కోశానా లేదు. పైగా అతడు ఒక రోజు రాజుగా ఇచ్చిన తీర్పులు ధర్మవిరుద్ధమైనవి కావు. శాసనాలన్నవి ప్రజల క్షేమానికే తప్ప వారిని వేధించడానికి కావు. తరతరాలుగా వస్తూన్నంత మాత్రాన అన్ని శాసనాలూ ధర్మసమ్మతమైనవనిగానీ, వాటిని కఠినంగా అమలు పరిచినంత మాత్రాన నేరాలు తగ్గిపోతాయనిగానీ చెప్పలేము. కాలానుగుణంగా శాసనాలను మార్చవలసిన గురుతర బాధ్యత పాలకులపై ఉన్నది. దోషిని పట్టుకోవాలని మారువేషంలో నగర సంచారానికి వెళ్ళినప్పుడే మహారాజుకీ వాస్తవం తెలియవచ్చింది. శిక్షలు కఠినంగా అమలు చేసినప్పటికీ రాజ్యంలో నేరాలు ఎందుకు తగ్గడం లేదో మహారాజుకు తెలియవచ్చింది. ప్రజల మాటలు ఆయన కళ్ళు తెరిపించాయి. సుదర్శనుడు చేసింది నేరమే అయినప్పటికీ, అది తనకు ఇంతగా ఉపకారం చేసింది గనకా, అతనికి ఎలాంటి దురాలోచనా లేదని గ్రహించాడు గనకా శిక్షించకుండా క్షమించాడు. రాజశేఖరుడు కేవలం చండశాసనుడే కాదు; ప్రజాక్షేమం పట్ల శ్రద్ధ కలవాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం: *గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన*]



## 'మత్స్యకన్య'గా మారిన మహిళ!

నాడ్యావిస్సీ మామూలు కాళ్ళతోనే పుట్టింది గాని, అవి సక్రమంగా పెరగకపోవడంతో పదహారవ యేట వాటిని తొలగించవలసి వచ్చింది. ఆమె యాభైలలో ఉండగా ఒక కుర్రాడు ఆమె కృత్రిమమైన కాళ్ళను చూసి ఉత్సుకత కొద్దీ రకరకాల ప్రశ్నలడిగాడు. నేను 'మత్స్యకన్య'ను అని తమాషాగా ఒక ప్రశ్నకు సమాధానమిచ్చింది నాడ్యా. ఆ సమాధానం విని పసివాడు ఆశ్చర్యంతో తన తండ్రికామాట చెప్పడానికి పరుగుతీశాడు.

ఈ సంఘటన నాడ్యాలో మెరుపు లాంటి ఆలోచనకు దోహదం చేసింది. వీటా వర్క్ షాపుకు తనకో చేపతోకను తయారు చేసి ఇవ్వమని ఉత్తరం రాసింది. వాళ్ళు అంగీకరించి ప్లాస్టిక్ ముడతలతో నీళ్ళల్లో వేసుకునే వస్త్రాలతో ఒక చేప తోకను తయారు చేసి ఇచ్చారు. దాన్ని చూడగానే నాడ్యా పరమానందం చెంది, ట్రియథ్లాన్ ఈత విభాగాన్ని పూర్తి చేయడానికి ఉపయోగించుకోవాలని ఆలోచిస్తోంది!




## గ్లోబల్ వార్మింగ్‌ను అరికట్టే అద్దాలు




అరిజోనా విశ్వవిద్యాలయానికి చెందిన డా రోజెరీ యాంజెల్ అనే అంతరిక్ష పరిశోధకుడు భూమి వెచ్చబడుతూన్న సమస్యను అద్దాలసాయంతో పరిష్కరించవచ్చునని విశ్వసిస్తున్నాడు.

భూమి ఉపరితలానికి పదిలక్షలమైళ్ళ దూరంలో వివిధ కోణాలలో పేర్చిన కోటానుకోట్ల అద్దాలను బ్రహ్మాండమైన ఫిరంగుల సాయంతో అమర్చాలి. ఈ ఫిరంగులకు మామూలు సంప్రదాయ ఆయుధాలకన్నా వందరెట్లు ఎక్కువ శక్తి ఉండాలి. ఈ అద్దాలను అమర్చడానికి ప్రత్యేకమైన మండలం 'జోన్' కావాలి. ఈ అద్దాలు సూర్యకిరణాల దిశను మారుస్తాయిగనక, సూర్యతాపం నుంచి భూమిని కాపాడే 'కవచం'లా అవి తప్పకుండా పనిచేయగలవని ఆయన భావిస్తున్నాడు.

ఇది చాలా వ్యయప్రయాసలతో కూడుకున్న పథకమే! దీనికి 350 ట్రిలియన్ డాలర్లు ఖర్చవుతాయనీ, అయినా తప్పక విజయవంతమయ్యే పథకమనేఅ

ఆయన దృఢంగా విశ్వసిస్తున్నాడు!

# భరతుడు




పురాణ వీరకుమారులు - 12

ధర్మ ప్రభువైన భరతుడనే చక్రవర్తి పరిపాలించడం వల్లే మన దేశానికి భారతదేశం అనే పేరు వచ్చింది. అయినా మన పురాణేతిహాసాలలో భరతుడనే పేర్లు గలవారు పలువురు తారసపడతారు.

ఋషభ-జయంతికల కుమారుడైన భరతుడు గొప్ప భూతదయాపరుడు. ఆయన అజనాభమనే రాజ్యాన్ని చిరకాలం పాలించి, రాజ్యాన్ని కుమారులకు అప్పగించి తపస్సు చేసుకోవడానికి అడవికి వెళ్ళాడు.

ఒకనాడాయన నదిలో స్నానం చేస్తూండగా ఒక చూడిలేడి ఆ నదికే వచ్చి నీళ్ళు తాగ సాగింది. ఆ సమయంలో ఉన్నట్టుండి కారుమబ్బులు పట్టి చీకటి కమ్ముకున్నది. భయంకరమైన ఉరుములకూ, మెరుపులకూ హడలిపోయిన చూడిలేడి అక్కడే పిల్లను ప్రసవించి ప్రాణాలు విడిచింది.

వృద్ధుడైన భరతుడా లేడిపిల్లపై జాలిపడి, దాన్ని తన ఆశ్రమానికి తీసుకువచ్చి ప్రేమతో పెంచసాగాడు.

క్రమేణా దానిమీద అమితమైన మమకారం పెంచుకున్నాడు. మరణ సమయంలో సైతం దాని స్ఫురణతోనే ఉండడంతో మరు జన్మలో తనే ఒక లేడిగా పుట్టాడట!

ఆ తరవాత కూడా అతడు భవబంధాలను తెంచుకుని జనన మరణాల వలయం నుంచి బయట పడలేక మరో రెండు జన్మలెత్తాడు. అనేక జన్మలలో సముపార్జించిన జ్ఞానాన్ని భగవత్కృపతో ఆచరణలో పెట్టి భరతుడు ఆఖరికి జన్మ విముక్తి పొందాడని భాగవత పురాణం పేర్కొంటున్నది!



ఇక ఆదర్శవంతమైన అన్నదమ్ముల ఐకమత్యానికి ఉదాహరణ పురుషులుగా భారతీయులు తరతరాలుగా చెప్పుకుంటూన్న దశరథ చక్రవర్తి కుమారులలో మూడవ వాడైన భరతుడి ఉదంతం జగద్విదితం!

తన ప్రమేయం లేకుండానే తన తల్లి కైకేయి [illegible]న విపరీత వరాల కారణంగా అగ్రజ[illegible]వ్యావాసం; తండ్రికి మరణం వాటిల్ల[illegible]ాసి తల్లఢిల్లిపోయాడు. అన్నను వెత[illegible]ా అరణ్యానికి వెళ్ళి, తిరిగి వచ్చి సి[illegible] అధిష్ఠించమని ప్రాథేయపడ్డా[illegible]డ్రికిచ్చిన మాటను తప్పలేనని శ్రీరా[illegible] రావడానికి తిరస్కరించడంతో ఆయన పాదుకలను తెచ్చి వాటికి అయోధ్యలో పట్టాభిషేకం జరిపి, తను నందిగ్రామంలో అన్న కోసం ఎదురుచూస్తూ పద్నాలుగేళ్ళు గడిపి, అన్న తిరిగి రాగానే ఆయన రాజ్యం ఆయనకు అప్పగించిన త్యాగధనుడు, ధర్మ నిరతుడు భరతుడు!

భరతుడనే పేరుగలవారిలో బాలవీర కుమారుడిగా ప్రసిద్ధిగాంచినవాడు శకుంతలా తనయుడైన భరతుడు.

రాజర్షి అయిన విశ్వామిత్రుడి కఠోరమైన తపస్సుకు భంగం కలిగించడానికి దేవేంద్రుడు మేనక అనే అప్సరసను పంపాడు. మేనక తన అందచందాలతో, నృత్య గీతాలతో విశ్వామిత్రుణ్ణి అలరించి మైమరపింపజేసింది. ఇద్దరికీ ఆడ శిశువు కలిగింది. దాంతో మేనక ఇంద్రలోకానికి వెళ్ళి పోయింది. అప్పటికి అసలు సంగతి గ్రహించిన విశ్వామిత్రుడు ఆగ్రహావేశం నిండిన వైరాగ్యంతో పసికందును అక్కడే వదిలి, తపస్సు చేసుకోవడానికి మరో చోటికి వెళ్ళిపోయాడు.

ఎండుటాకుల మధ్య పడి ఉన్న బిడ్డ చుట్టూ కొన్ని శకుంత పక్షులు చేరి పరిచర్యలు చేయడం చూసిన కణ్వముని, ఆ బిడ్డను తన ఆశ్రమానికి తీసుకువచ్చి, శకుంతల అని నామకరణం చేసి తన కూతురిలాగే భావించి అల్లారుముద్దుగా పెంచసాగాడు.

నవయౌవనంలో అడుగుపెట్టిన శకుంతల ఒకనాడు చెలులతో కలిసి పూలమొక్కలకు నీరు పోస్తూండగా, అరణ్యానికి వేటకు వచ్చిన దుష్యంతుడనే రాజు, ఒక లేడిని తరుముకుంటూ అటువైపు వచ్చాడు. అపూర్వమైన శకుంతల సౌందర్యాన్ని చూసి పూర్వజన్మ పుణ్యాల అఖండ ఫలంగా భావించి ముగ్ధుడయ్యాడు. ఆమె కూడా రాజుపట్ల ఆకర్షితురాలయింది. ఇరువురూ గాంధర్వ వివాహం



చేసుకున్నారు. ఆమెకు తన ఉంగరాన్ని కానుకగా ఇచ్చి, త్వరలో వచ్చి రాజధానికి వెంటబెట్టుకుని వెళ్ళగలనని చెప్పి దుష్యంతుడు తిరిగి వెళ్ళిపోయాడు.

శకుంతల ఒకనాడు దుష్యంతుని గురించి ఆలోచిస్తూ, అప్పుడనగా వచ్చిన దుర్వాస మునిని గమనించకుండా ఉండి పోయింది. దాంతో ఆగ్రహం చెందిన ముని, ''ఎవరి తలపులలో లీనమైపోయి నన్ను ఉదాసీన పరచావో, ఆ వ్యక్తి నిన్ను మరిచిపోవుగాక!'' అని శపించాడు.

ఆ శాపం శకుంతల చెవిన పడలేదుగానీ, దానిని విన్న ఆమె చెలికత్తెలు శాపవిమోచన మార్గం చెప్పమని మునిని వేడుకున్నారు. ముని శాంతించి, ఆనవాలు చూపితే శాప విముక్తి కలుగుతుందని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇవన్నీ జరిగినప్పుడు తీర్థయాత్రలకు వెళ్ళిన కణ్వముని, కొన్నాళ్ళకు తిరిగి వచ్చాడు. జరిగినది విని కలత చెందాడు. ఆ తరవాత అంతా దైవ సంకల్పమనుకుని మనసును దిటవు చేసుకున్నాడు. గర్భ లక్షణాలు కనిపిస్తూన్న శకుంతలను దగ్గరకు తీసుకుని, ''మోహావేశంతో ప్రవర్తించినా, మంచివాడి చేతిలోనే పడ్డావులే,'' అని ఓదార్చి ఆమెను భర్తవద్దకు పంపే సన్నాహాలు ప్రారంభించాడు.

పెద్దలను గౌరవిస్తూ, భర్తను, పిల్లలనూ ప్రేమిస్తూ, సేవకులను ఆదరిస్తూ గర్వం లేకుండా మంచి గృహిణిగా నడుచుకోమని బిడ్డకు మంచి మాటలు చెప్పాడు. బరువెక్కిన హృదయంతో, పెల్లుబికే కన్నీళ్ళను ఆపు

కుంటూ ఆమెను మెట్టినింటికి చెలికత్తెలను, శిష్యులను తోడిచ్చి సాగనంపాడు.

తీరా రాజధానికి చేరిన శకుంతలను దుష్యంతుడు గుర్తించక, స్వీకరించడానికి నిరాకరించాడు. అతడిచ్చిన ఉంగరం చూపుదామనుకుంటే, అది ప్రయాణం సమయంలో శకుంతల చేతి నుంచి జారి నదిలో పడిపోయింది. నిస్సహాయురాలుగా నిలబడ్డ శకుంతలను చూసి తల్లి అయిన మేనక ఆమెను హేమకూటాగ్రంలోని అదితి-మారీచ ప్రజాపతుల ఆశ్రమానికిచేర్చి రక్షణ కల్పించింది. శకుంతల మగబిడ్డను ప్రసవించింది.

ఇక్కడ నదిలో పడిపోయిన శకుంతల వేలి ఉంగరాన్ని ఒకచేప మింగింది. అది ఆఖరికి ఆ చేపను పట్టిన జాలరి ద్వారా దుష్యంతుడి వద్దకు చేరింది. దాన్ని చూడగానే అతనికి మరిచిపోయిన శకుంతల ఉదంతం జ్ఞాపకం వచ్చింది. ఆమెను చూడాలని తపించిపోసాగాడు.

కొన్నాళ్ళకు దేవదానవ యుద్ధంలో దుష్యంతుడు దేవతలకు సాయం చేసి తిరిగి వస్తూ, మారీచప్రజాపతి ఆశ్రమ సమీపంలో పులులతో, సింహాలతో ఆడుకుంటున్న పసి బాలుణ్ణి చూసి ముగ్ధుడయ్యాడు. ఆ వీర కుమారుణ్ణి కన్నవాళ్ళెవరో కదా అని ఆశ్చర్య పోయాడు. అంతలో అక్కడికి శకుంతల వచ్చింది. ఆమెనుగుర్తించి మందహాసం చేశాడు. ఆ వీర కుమారుడు తమ బిడ్డ సర్వదమనుడే అని శకుంతల దుష్యంతుడికి తెలియజేసింది. దుష్యంతుడు పరమానందం చెందాడు.

ఆ తరవాత పుణ్యదంపతులైన అదితి-మారీచ ప్రజాపతుల ఆశీస్సులు పొంది దుష్యంతుడు భార్యనూ, బిడ్డనూ వెంటబెట్టుకుని రాజధానికి చేరాడు. కుమారుడికి భరతుడని పేరుపెట్టివిద్యాబుద్ధులు నేర్పి, యుక్తవయస్కుడయ్యాక రాజ్య పట్టాభిషిక్తుణ్ణి చేశాడు.

భరతుడు ప్రజాక్షేమమే యజ్ఞంగా, జీవితమే తపస్సుగా ప్రజానురంజకంగా పాలన సాగించాడు. అందువల్లే అతడు పురాణ వీరకుమారుడిగానే కాకుండా-భరత వర్షం, భరత ఖండం అంటూ మన దేశం పేరులోనే స్థిరస్థాయిగా నిలిచి తరగని కీర్తి చంద్రికలు వెదజల్లుతున్నాడు!



# విజ్ఞానం... వినోదం... వికాసం...



## విజ్ఞాన వీచికలు

# జేమ్స్ ప్రెస్కాట్ జౌల్

అన్ని రకాల శక్తినీ 'జౌల్' కొలమానంతో కొలుస్తారు. వాట్, ఓమ్ లాగే ఇది కూడా ఒక విజ్ఞాన శాస్త్రవేత్త పేరు మీదుగానే వచ్చింది.

జేమ్స్ ప్రెస్కాట్ జౌల్ ఇంగ్లాండు మాంచెస్టర్ సమీపంలోని సాల్ఫోర్డ్‌లో 1818వ సంవత్సరం జన్మించాడు. జౌల్‌కు బాల్యం నుంచే విజ్ఞాన శాస్త్రం పట్ల అమిత ఆసక్తి ఉండేది. ఆనాటి పలువురు శాస్త్రవేత్తల్లాగే ఆయన కూడా అనేక సమస్యలను ఎదుర్కోవలసి వచ్చింది. ఉష్ణోగ్రతను 1/200 వంతు ఫారెన్‌హీట్ డిగ్రీ వరకు స్పష్టంగా లెక్కగట్ట వచ్చని ఆయన చెప్పాడు. అయినా ఆనాటి శాస్త్రవేత్తలు అది అసాధ్యమని కొట్టిపారేశారు.

ఆ రోజుల్లో ప్రజలు వేడి 'ద్రవ'(ది కెలోరిక్)రూపమని నమ్మారు. జౌల్ ఈ సిద్ధాంతం తప్పని నిరూపించి - శక్తి వివిధ రూపాలలో ఒకటి వేడి అనీ, అన్ని రకాల శక్తి మొత్తం ఏ సిస్టమ్‌లోనైనా ఒకే విధంగా ఉంటుందనే భావనను అభివృద్ధి పరిచాడు.

## మన పరిసరాలు

# రంగు రంగుల ప్రాణులు



పిల్లలాడుకునే దాగుడుమూతలు చాలా ప్రాచీనమైన క్రీడ. ఇది మనుషులకే పరిమితం కాదు. చాలా ప్రాణులు దీనిని సహజంగా ఆడుకోవడం చూడవచ్చు. చిన్న చేపలు పెద్ద చేపల నుంచి తప్పించుకోవడానికి దాగుడు మూతలాడుతూ ఉంటాయి. పక్షుల నుంచి తప్పించుకోవడానికి క్రిమికీటకాలు, సీతాకోకచిలుకలు మొదలైనవి ఇదే దారిని అనుసరిస్తున్నాయి. పరిసరాలలో కలిసిపోయేలా ఉండే కొన్ని జంతువుల రంగులు ఇందుకు ఎంతో ఉపకరిస్తున్నాయి. సీతాకోకచిలుక రెక్కలు కొన్ని ఆకుల్లో ఆకుల్లాగా కలిసిపోతాయి.

రంగుల మార్పులు ప్రాణులకు తమను తాము రక్షించుకోవడానికీ, ఇతర ప్రాణులపై దాడి చేయడానికీ ఉపయోగపడుతున్నాయి. ఊసరవెల్లులు రక్షణకు రంగులు మారిస్తే, ఆఫ్రికా సింహాలు జంతువులను వేటాడడానికి మారుస్తున్నాయి. అవి ఏపుగా పెరిగిన గడ్డి మైదానాలలో దాగి ఉండి జంతువులను సులభంగా పట్టుకుంటాయి!




# మ్యాన్ ఆఫ్ ది మిస్‌మ్యాచ్

సుప్రసిద్ధులైన ఈ క్రికెట్ క్రీడాకారులను గుర్తు పట్టగలరా? వాళ్ళ కళ్ళు, ముక్కు, పెదాలను కత్తిరించి 38వ పేజీలోని ముఖరేఖా చిత్రాలలో అతికించి ఎవరని నిరూపించగలరా? మరింకెందుకు ఆలస్యం? వెంటనే అతికించి మీ మ్యాన్ ఆఫ్ ది మిస్‌మ్యాచ్‌ని మాకు పంపండి. అత్యంత సృజనాత్మకమైన ముఖానికి బహుమతి రూ. 500! మరియు ఒక ''హనుమాన్ సోనీ ప్లే స్టేషన్ 2'' టి-షర్ట్. మీరు ఆన్‌లైన్‌లో **www.chandamama.com/cricket**లోనూ ఆడి మీ ఎంట్రీ ప్రింటవుట్లను 2009 మే 31 తేదీలోగా మాకు పంపాలి.

ఎంట్రీలు పంపవలసిన చిరునామా:
చందమామ ఇండియా లిమిటెడ్
2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్‌రోడ్, చిన్న నీలాంగరై,
చెన్నయ్ 600041.




# చందమామ క్రికెట్ క్రిస్టల్ బాల్

ప్రత్యక్ష ప్రసారం! దక్షిణాఫ్రికా నుంచి! ఐపిఎల్ అనుభూతి పొందండి చందమామతో! చందమామ క్రికెట్ క్రిస్టల్ బాల్ కంటెస్ట్*లో పాల్గొనండి! రాజస్థాన్ రాయల్స్, టైటిల్‌ను విజయవంతంగా దక్కించు కోగలదా? ఊహించడం మొదలుపెట్టండి... అద్భుత అవకాశం మళ్ళీమళ్ళీ రాదు!

మీ డ్రీమ్‌టీమ్‌ను రూపొందించి మీ ప్రెడిక్షన్స్ తెలియజేయండి. మీ జాబితాను **2009**మే **15**లోగా మాకు పంపండి. అన్ని మ్యాచ్‌లను జాగ్రత్తగా వీక్షించి ఎవరు వెలుపల, ఎవరు లోపల అన్నది నిర్ణయించండి!

మీ ప్రెడిక్షన్స్ నిజమై మీ డ్రీమ్‌టీమ్-చందమామ ఎక్స్‌పర్ట్ ప్యానల్ రూపొందించిన టీమ్‌తో మ్యాచ్ అయినట్టయితే ఎంట్రీలు పంపిన 5గురు అదృష్ట వంతులైన ప్లేయర్స్** చెరొక ల్యాప్‌టాప్ గెలుచుకుంటారు! మరి ఇంకా ఎందుకు ఆలస్యం? ఆడడం ప్రారంభించండి!

ఫైనల్స్ వీళ్ళ మధ్య ఆడబడుతుంది:
అధిక సంఖ్యలో సిక్సర్‌లు కొట్టేది:
ఈ యేడు ఎవరు బహిష్కరించబడతారు?:
ఈ సంవత్సరం ఎవరు ఏడుస్తారు?:
అత్యధిక సంఖ్యలో పరుగులు సాధించే బౌలర్?:
ఐపిఎల్ -**09** బెస్ట్ బౌలర్:
ఐపిఎల్ -**09** బెస్ట్ బ్యాట్స్ మ్యాన్:

మీ డ్రీమ్ టీమ్ పేరు:
సభ్యులు
1. (కెప్టెన్)
2. (వికెట్ కీపర్)
3. ____________
4. ____________
5. ____________
6. ____________
7. ____________
8. ____________
9. ____________
10. ____________
11. ____________



ఎంట్రీలు పంపవలసిన చిరునామా:
చందమామ ఇండియా లిమిటెడ్
2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్‌రోడ్,
చిన్ననీలాంగరై, చెన్నయ్-600041.

చందమామ క్రికెట్ క్రిస్టల్ బాల్ కంటెస్ట్‌ను మీరు ఆన్‌లైన్‌లో **www.chandamama.com/cricket**లోనూ ఆడవచ్చు.

సమాధానాలు ఈ పేజీలో నింపి, దానిని కత్తిరించి తపాలా ద్వారా పంపబడిన ఎంట్రీలు మాత్రమే స్వీకరించబడతాయి. తక్కినవి అంగీకరించబడవు. అన్నీ సరైన సమాధానాలు గల ఎంట్రీలు రానట్టయితే, సరైన సమాధానాలకు అతి సమీపంగా ఉండే సమాధానాలు పంపిన ప్లేయర్‌కి మెగా బహుమతి అందజేయబడుతుంది.

* Terms and Conditions apply. Employees and family members/ relatives of employees of Chandamama or other companies belonging to the parent company are not permitted to participate in the contest. Entries from such parties will not be entertained and will be disqualified.
** The prizes are offered across 13 editions of *Chandamama*.




# బుబ్బాలూ వ

| | | |
|---|---|---|
| 7 | 8 | 21 |
| 6 | 9 | 20 |
| 5 | 10 | 19 |
| 4 | 11 | 18 |
| 3 | 12 | 17 |
| 2 | 13 | 16 |
| 1 | 14 | 15 |

గైడ్‌లైన్స్

- మ్యాంగో పీచ్ కాయిన్స్‌ను కుడివైపున కట్ చేసుకోండి.
- వాటిని నాణేల వంటి దృఢమైనవాటి మీద అతికించండి.
- డై వేసి ఆడడం ప్రారంభించండి.
- సూచనలకు కీ రెఫర్ చేయండి.

**బుబ్బాలూ మ్యాంగో పీచ్ ట్రెజర్ బాక్స్‌ను ఎవరు గెలుచుకుంటారు?**

**ఆడండి మరి...**

కీ

- రెండు గడులు పైకి వెళ్లండి

- ఐదు గడులు పైకి ఎక్కండి



Board Game designed by Chandamama

# ్యాంగో పీచ్ బోర్డ్ గేమ్

## జ్యూసీ మస్తీ




| | | | |
|---|---|---|---|
| 22 | 35 | 36 | 49 |
| 23 | 34 | 37 | 48 |
| 24 | 33 | 38 | 47 |
| 25 | 32 | 39 | 46 |
| 26 | 31 | 40 | 45 |
| 27 | 30 | 41 | 44 |
| 28 | 29 | 42 | 43 |

ప్లేయింగ్ కాయిన్స్









 - ఐదు గడులు కిందికి దిగండి   - ఒక టర్న్ మిస్

 - చివరి గడికి చేరుకోండి



1947 నుంచి చందమామ కథలకోసం...
చూడండి telugu.chandamama.com ఆర్కైవ్‌లు.
సమస్త కథల భాండాగారం... చందమామ ఆర్కైవ్‌లు
సులభంగా వీక్షించేలా... సరికొత్త రూపంలో ఆర్కైవ్‌లు...
చందమామలో మీకు ఇష్టమైన అన్ని కథలనూ ఆర్కైవ్‌లు విభాగంలో చూడండి.

## ARCHIVES



బాస్: ఎక్కడ పుట్టారు?
చింటూ: ఇండియా
బాస్: ఏ భాగం?
చింటూ: ఏ భాగం ఏమిటి? శరీరం మొత్తంగా అక్కడే పుట్టింది...
మరిన్ని జోక్స్ కోసం చందమామ ఆన్‌లైన్ చూడండి.

## JOKES



ట్వంటీ 20 క్విజ్‌లో పాల్గొనండి.

మీ జట్టు టీ షర్టులను మీరే రూపొందించండి.

## CRICKET FEVER



బిగ్ బ్యాంగ్, డైనోసార్లు, నక్షత్రాల కథ...
చరిత్ర, ఘటనలు, జికె, అంతరిక్ష రహస్యాలు...
ఆసక్తికరమైన అన్ని అంశాలకు లోకజ్ఞానం చూడండి.
మరిన్ని వివరాలకు
telugu.chandamama.com వెబ్‌సైట్‌ను సంప్రదించండి.

## GENERAL KNOWLEDGE



# చిత్రకథను పూర్తి చేయండి
























కలర్‌ఫుల్ క్రికెట్ కాంట్రవర్సీస్ ఆలోచించండి. మీ ఎంట్రీలను contests@chandamama.comకు ఈ-మెయిల్ చెయ్యండి. బెస్ట్ ఎంట్రీకి బహుమతి రూ.500!

తపాలా ద్వారా ఎంట్రీలు పంపవలసిన చిరునామా:

చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్‌రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ 600041.

# చందమామ లోకజ్ఞానం క్విజ్-4

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

***Co-sponsored by* Infosys *FOUNDATION, Bangalore***

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. **250**లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - **4** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మే నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. జూలై నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ప్రపంచ సంఘటనలు, ప్రముఖులు




1. సాగ్రెస్‌లో ప్రపంచంలోకెల్లా మొట్టమొదటి 'నౌకా సంస్థ'ను ఎవరు స్థాపించారు?
2. ఆధునిక వైద్యశాస్త్రాల(మోడర్న్ ఫిజియోలాజికల్ సైన్స్‌కు) పితగా పాదువాలోని ఒక సర్జరీ ప్రొఫెసర్‌ను పేర్కొంటారు. ఆయన ఎవరు?
3. పాక్షికంగా కనుచూపు కోల్పోయిన స్థితిలో ఆయన రెండు ఉద్గ్రంథాలను రచించాడు. ఆయన ఎవరు? ఆయన రచించిన గ్రంథాలు ఏవి?
4. యూరపులో వేలాది మంది ప్రాణాలు తీసిన మహమ్మారి లండన్‌లో జరిగిన ఒక అగ్నిప్రమాదంతో నివారించబడింది. అదేమిటి? అది ఎప్పుడు జరిగింది?
5. అచ్చుయంత్రాన్ని ఎవరు కనుగొన్నారు? కొత్తసాంకేతిక పరిజ్ఞానంతో అచ్చయిన మొట్టమొదటి పుస్తకం ఏది?

బీర్బల్ కథలు : 21

# దీపం వెచ్చదనం



శీతాకాలం మధ్యాహ్న సమయంలో అక్బర్ చక్రవర్తి యమునానదీ తీరానికి షికారుకు వెళ్ళాడు. ఆయన వెంట బీర్బల్‌తో సహా కొందరు సభికులు నడుస్తున్నారు. మంద గమనంతో సాగుతూన్న నదీ జలాలను చూస్తూ, ''శీతల వాయువులు మంచుకొండల నుంచి మోసుకొచ్చిన చల్లదనాన్ని నదీజలాల్లో కలిపి వాటికిమరింతచల్లదనం సమకూరుస్తున్నాయి,'' అన్నాడు చక్రవర్తి.

''ఇంత చల్లటి నీళ్ళల్లో అడుగుపెట్టడానికి కూడా ఎవరూ సాహసించలేరు,'' అన్నాడు ఒక అధికారి.

''తగిన ప్రోత్సాహకం అందజేయాలేగాని, పగటిపూటే కాదు; కావాలంటే రాత్రంతా రొమ్ముల లోతు నీళ్ళల్లో గడిపే మహాను భావులూ ఉంటారు,'' అన్నాడు బీర్బల్.

''అసాధ్యం! ఎవడైనా అలాంటి దుస్సాహ సానికి పూనుకుంటే రక్తం గడ్డకట్టుకుపోయి చస్తాడు,'' అన్నాడు చక్రవర్తి.

''ప్రయత్నించనంత వరకే ఏదైనా అసాధ్యం షహేన్‌షా,'' అన్నాడు బీర్బల్.

''నువ్వంత రూఢిగా ఎలా చెప్పగలవు?'' అని అడిగాడు చక్రవర్తి.

''బహుమతి ప్రకటించి చూడండి. నేను చెప్పడం సరో కాదో తెలిసిపోతుంది,'' అన్నాడు బీర్బల్ వినయంగా.

యమునానదిలో రొమ్ముల లోతు నీళ్ళల్లో రాత్రంతా గడిపిన వారికి వంద మొహరీలు బహుమతిగా ఇవ్వబడుతుందని మరునాడు ఉదయమే చాటింపు చేయబడింది.

ఆ చాటింపును మంగేష్ అనే ఒక రజకుడు విన్నాడు. అతడు డబ్బు అవసరంలో ఉన్నాడు. ''వంద మొహరీలు! వాటితో నా అప్పులన్నీ తీరిపోతాయి. ఖర్చులన్నీ పోను కొంత మిగు లుతుంది కూడా,'' అన్నాడు భార్యతో.

''ఆలోగా నువ్వు చలికి బిర్రబిగుసుకు పోకుంటే సరి,'' అని హెచ్చరించింది భార్య.

''ఆ భయమేం లేదు. నా చిన్నప్పుడు శీతాకాలం రాత్రుల్లో యమునలో ఈదేవాణ్ణి,'' అంటూ భార్య చేతిని ఆప్యాయంగా పట్టుకుని, ''వంద మొహరీలంటే మాటలా? ఆలోచించి చూడు,'' అన్నాడు మంగేష్ నవ్వుతూ.

మరునాడు మంగేష్ రాజభవనానికి వెళ్ళి, వచ్చిన పని చెప్పి చక్రవర్తి దర్శనం కావాల న్నాడు. అధికారి అతణ్ణి చక్రవర్తి వద్దకు తీసుకు వెళ్ళాడు. అతడు నేలను తాకి నమస్క రించి, ''షహేన్‌షా, తమ చాటింపు విన్నాను. రొమ్ముల లోతు యమునానది నీళ్ళల్లో రాత్రంతా గడుపడానికి నేను సిద్ధం,'' అన్నాడు.

''మంచిది,'' అంటూ చక్రవర్తి అధికారి కేసి తిరిగి, అందుకు కావలసిన ఏర్పాట్లు చేయమన్నాడు. నదీ తీరంలో కాపలా కాయ డానికి ఇద్దరు భటులు వచ్చారు. తెల్లవార్లూ అతడు రొమ్ములలోతు నీళ్ళల్లో ఉన్నాడా అని కనిపెట్టి చూడడం వాళ్ళ బాధ్యత. ఆ మాట వినగానే భటులు, ''రాత్రంతా యమునా తీరంలోనా,'' అని గొణుక్కున్నారు. అయినా రాజాజ్ఞ! పాటించక తప్పదు కదా!

సాయంకాలం భటులు మంగేష్‌ను నదీ తీరానికి నడిపించారు. వాళ్ళు ఉన్నిబట్టలు ధరించి, నదీ తీరంలోని గుడారంలో కూర్చున్నారు.

మంగేష్ మొలకు కట్టుకున్న బట్టను తప్ప తక్కిన దుస్తులన్నిటినీ తీసేశాడు. పెనుగాలిలో ఆకులా వణికిపోసాగాడు. ప్రాణాలను పణంగా పెడుతున్నానా అని ఒక్క క్షణం భయపడ్డాడు. అయినా ఇంతదూరం వచ్చాక ఇప్పుడు ఆలోచించి లాభం లేదు. ''వంద మొహరీలు!'' అనుకున్నాడు మన సులో. ''ఒక్క రాత్రి చలి బాధను తట్టుకుని నిలబడితే వంద మొహరీలు నా చేతిలో,'' అన్న ఆలోచనతో ధైర్యాన్ని కూడదీసుకుంటూ నీళ్ళలోకి దిగి నిలబడడానికి అనువైన, రొమ్ములలోతు నీళ్ళల్లో నిలబడ్డాడు.

చీకటికమ్ముకోవడంతో నక్షత్రాలు ఒక్కొక్కటిగా మెరవసాగాయి. నెలవంక కనిపించి కనుమరుగయింది. ఎముకలు కొరికే చలి. రాత్రి అయ్యే కొద్దీ చలి ఉధృతం పెరగసాగింది. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని క్షణమొక యుగంగా గడపసాగాడు.

ఉన్నట్టుండి అతడి చూపులు దూరంగా కోట బురుజు నుంచి మిణుకు మిణుకుమనే దీపం వెలుగుమీద పడింది. ''ఆహా! దూరం లోని ఆ దీపం కూడా కొంతవెచ్చగానే ఉన్నది!'' అనుకున్నాడతడు మనసులో.

దీపమూ, వెచ్చదనమూ గురించిన ఆలోచ నలు అతడి భయాలను పోగొట్టి ధైర్యాన్నివ్వ సాగాయి. వాటి మీదే మనసును కేంద్రీకరించ





డంతో చలిని గురించి మరిచిపోయాడు. దూరంగా కోడి కూత వినిపించింది. తూరుపు దిక్కున వెలుగు రేఖలు కనిపించాయి. తన కష్టాలు గట్టెక్కనున్నాయని మంగేష్ పరమానందం చెందాడు.

''వెలుపలికిరా మంగేష్! ఇంకాస్సేపటికి వంద మొహరీలు నీకు సొంతం!'' అని కేక వేశారు గట్టుమీది భటులు.

గట్టుమీదికి వచ్చిన మంగేష్ ఒళ్ళు తుడుచుకుని పొడిబట్టలు కట్టుకుని, రాజభవనానికి భటులతో బయలుదేరాడు. వాళ్ళు భవనంలో అడుగు పెట్టేసరికి చక్రవర్తి బీర్బల్‌తో సహా ప్రముఖులతో కొలువుదీరి ఉన్నాడు.

''షహేన్‌షా! రాత్రి తెల్లవార్లూ ఇతడు నదిలో రొమ్ముల లోతు నీళ్ళల్లో గడిపాడు,'' అన్నారు భటులు.

చక్రవర్తికి ఆ మాటలు నమ్మశక్యంగా లేవు. చలిని భరించడానికి ఆ మనిషి ఏదో కిటుకును ఉపయోగించి ఉండవచ్చని ఆయన అనుమానించాడు. ముందుకు వంగి, ''చలిని ఎలా దూరంగా ఉంచగలిగావు? నిజం చెప్పు,'' అని అడిగాడు.

''షహేన్‌షా! కోట బురుజుమీది దీపం నాకు వెచ్చదనం సమకూర్చింది,'' అని సమాధానమిచ్చాడు మంగేష్ అమాయకంగా.

''దీపం నీకు వెచ్చదనం ఇచ్చింది! అంటే నీకు వెలుపలి నుంచి సాయం అందిందన్నమాట! అందువల్ల బహుమతికి నువ్వు అనర్హుడివి!'' అన్నాడు చక్రవర్తి.

మంగేష్ ముఖం వెలవెలబోయింది. చక్రవర్తి తీర్పుకు బదులు చెప్పలేక అతడు బాధతో తలదించుకున్నాడు.

బీర్బల్ కూడా ఆశ్చర్యపోయాడు గాని, ఒక్కమాట మాట్లాడలేదు. ఆశాభంగానికి గురైన మంగేష్ వంగి నమస్కరించి భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళడం మౌనంగా చూస్తూండిపోయాడు. బహుమతిని ఆశించి మంగేష్ ప్రాణాంతకమైన చలిని భరించాడు. కాని అతడి ఆశ ఫలించలేదు!

మంగేష్‌కు తీరని అన్యాయం జరిగిందని బీర్బల్ భావించాడు. అతడికి ఎలాగైనా న్యాయం జరిగేలా చూడాలని నిర్ణయించాడు.

మరునాడు ఇంటివద్ద తనకు అత్యవసరమైన పనిపడిందనీ, అందువల్ల ఆ రోజు సభకు రాలేననీ చక్రవర్తికి కబురు పంపాడు బీర్బల్.

''అత్యవసరమైన పనా! చక్రవర్తి సేవకు మించిన పని, అదేమిటి?'' అని గొణిగాడు చక్రవర్తి.

బీర్బల్ అంటే అసూయగల కొందరు సభికులు సంతోషించారు. ఈసారి బీర్బల్ తప్పక చిక్కుల్లో పడగలడని ఆశించారు.

చక్రవర్తి భటులను పిలిచి, బీర్బల్‌ను వెంటబెట్టుకు రమ్మని ఆజ్ఞాపించాడు. భటులు బీర్బల్ ఇంటికి వెళ్ళి సంగతి చెప్పారు.

''నేను కిచడి తయారు చేస్తున్నాననీ, ఆ పని పూర్తి కాగానే పరిగెత్తుకు రాగలననీ చక్రవర్తికి చెప్పండి,'' అన్నాడు బీర్బల్.

భటులు ఆ సంగతి చక్రవర్తికి విన్నవించారు.

''మూర్ఖుడా!'' అని మండిపడ్డ చక్రవర్తి వెంటనే శాంతించి, ''ఆ తుంటరి వెధవాయి దేనికైనా సమర్థుడు. ఏం చేస్తున్నాడో ఏమో స్వయంగా వెళ్ళి చూద్దాం,'' అని అనుకున్నాడు.

వెంటనే ఆయన గుర్రం మీద బీర్బల్ ఇంటికి బయలుదేరాడు. బీర్బల్ ఇంటి వాకిట్లో కనిపించాడు. పొయ్యిలో ఎండు కట్టెలు పెట్టి మంట రగిలిస్తున్నాడు. వట్టి పొయ్యికి ఐదడుగుల దూరంలో ముక్కాలి పీట మీద మట్టి కుండ కనిపించింది.

చక్రవర్తిని చూడగానే బీర్బల్ చేతిలోని కట్టెను కింద పడేసి లేచి ఆయన దగ్గరికి పరిగెత్తుకు వెళ్ళి, నేలను తాకి నమస్కరించాడు.

''ఏం చేస్తున్నావు బీర్బల్?'' అని అడిగాడు చక్రవర్తి.

''కిచడి వంట చేస్తున్నాను షహేన్‌షా. అదిగో ఆ ముక్కాలిపీట మీది కుండలోకి

# మన దేశం క్విజ్

## క్రీడా ప్రపంచం



1. ఇండియాలో క్రికెట్ మొట్టమొదట అధికారికంగా ఎప్పుడు ఎక్కడ ఆడబడింది?
2. రంజి ట్రోఫీ ఎప్పుడు ఏర్పాటు చేయబడింది? తొలి రంజీ టోర్నమెంటులో ఎవరు గెలుపొందారు?
3. 'విస్డెన్'తో సత్కరించబడిన తొలి భారతీయ క్రికెట్ క్రీడాకారుడు ఎవరు?
4. మొట్టమొదటి డ్యూరండ్ కప్పును సాధించిన భారతీయ జట్టు ఏది? ఎప్పుడు?
5. ఏషియన్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్‌లో ఇండియా బంగారం ఏ సంవత్సరం గెలుపొందింది?
6. ఏషియన్ గేమ్స్ ఎప్పుడు ఎక్కడ ఏర్పాటు చేయబడ్డాయి? అందుకు చొరవ తీసుకున్నవారెవరు?
7. 'విజార్డ్ ఆఫ్ హాకీ'గా ఎవరిని చెబుతారు?
8. తొలి అర్జున అవార్డును ఎవరు గెలుపొందారు?

(సమాధానాలు 66వ పేజీలో)

బియ్యం, పప్పు వేశాను,'' అన్నాడు బీర్బల్.

''కుండ కింద మంట కనిపించదే మరి?'' అని అడిగాడు చక్రవర్తి కనుబొమలు ముడిచి.

''అదిగో అక్కడ ఉంది కదా మంట,'' అంటూ ఐదడుగుల దూరంలో మండుతున్న పొయ్యిని చూపాడు బీర్బల్.

''కుండకు మంట వేడి తగలకుండా అందులోని బియ్యం, పప్పు ఎలా ఉడుకుతుందనుకున్నావు?'' అని అడిగాడు చక్రవర్తి విసుగ్గా.

బీర్బల్ చిన్నగా నవ్వాడు.

''నవ్వు సమాధానం కాజాలదు. పప్పు, బియ్యం ఉన్న కుండ మంటకు దూరంగా ఉంటే అవి ఎలా ఉడుకుతాయి?'' అని అడిగాడు చక్రవర్తి మళ్ళీ కోపంగా.

''షహేన్‌షా! మంట వేడి చాలా దూరానికి చేరగలదని తమరే నాకు బోధించారు,'' అన్నాడు బీర్బల్.

''నేను బోధించానా? ఎప్పుడు? ఎక్కడ?'' అన్నాడు చక్రవర్తి అయోమయంగా.

''తమరే బోధించారు షహేన్‌షా! యమునా నది శీతల జలాల మధ్య నిలబడ్డ మంగేష్‌కి, కోట బురుజుపై వెలిగే మసక దీపం వెచ్చదనం అందించిందని నిండు సభలో తమరే సెలవిచ్చారు కదా?'' అన్నాడు బీర్బల్ వినయంగా స్పష్టమైన కంఠస్వరంతో.

బీర్బల్ మాటల అంతరార్థం గ్రహించి విస్తుపోయిన చక్రవర్తి, ''ఆహా!'' అంటూ భటులకేసి తిరిగి, 'వెంటనే వెళ్ళి మంగేష్‌ను వెంటబెట్టుకు రండి. ప్రకటించిన బహుమతిని అతడికి అందజేయాలి,'' అని ఆజ్ఞాపించాడు.



''షహేన్‌షా, న్యాయం జరిగింది గనక, ఇప్పుడు ముక్కాలి పీట మీది బియ్యం, పప్పుకుండ పొయ్యి మీదికి చేరుతుంది,'' అన్నాడు బీర్బల్.

ఆ మాటకు చక్రవర్తితో సహా అందరూ గలగలా నవ్వారు.

–ఆర్.కె.మూర్తి



# వైరాగ్యం

[*గత సంచిక తరువాయి*]

సన్యాసి కాదలచిన మహాజనకుడు రాజ భవనం పైఅంతస్తులో కూచుని ఎవరినిగాని చూడలేదు, కిందికి దిగి రాలేదు. నాలుగు నెలలు గడిచాయి. రాజభవనం ఆయనకొక బందిఖానా లాగా తోచి అక్కడి నుంచి బయట పడాలని తీవ్రమైన కోరిక కలిగింది.

ఆయన తన నౌకరును పిలిచి తనకు కాషాయవస్త్రాలూ, మట్టిపాత్రా తెమ్మన్నాడు. మంగలిని పిలిపించి తల అంతా క్షౌరం చేయించుకున్నాడు. మర్నాడాయన కాషాయవస్త్రాలు ధరించి, ఒక చేత మట్టిపాత్రా, ఇంకొక చేతిలో కర్రా పట్టుకుని పైఅంతస్తు నుంచి దిగి వచ్చాడు. దిగి వస్తూండగా రాణి ఆయనను చూసింది గాని గుర్తించలేదు. కానీ అతి త్వరలోనే నిజం బయటపడింది. సీవలీదేవి మేడ మీదికి వెళ్ళి తన భర్తకేశాలు కింద పడి ఉండటం గమనించింది. రాజభవనం అంతా వెతికారు. రాజు జాడ లేదు. రాజుగారు సన్యసించాడని గ్రహించారు. అందరూ ఏడుస్తూ సన్యాసి వెళ్ళిన దిక్కుగా వెళ్ళారు. సీవలీదేవి మిగిలిన రాణులను వెంటబెట్టుకెళ్ళి, తిరిగి రమ్మని ఆయనను బతిమాలింది. కానీ ఫలితం లేకపోయింది.

సీవలీదేవి సేనానాయకుణ్ణిపిలిచి ఆయనతో రహస్యంగా, నగరంలో అనేక చోట్ల మంటలు పెట్టించమన్నది. ఆయన అలాగే చేశాడు. అప్పుడు రాణి తన భర్త వద్దకు వెళ్ళి, ''మహారాజా, మీ మిథిలా నగరం అంటుకున్నది. మీ సంపద యావత్తూ అగ్గిపాలవుతున్నది! దాన్ని కాపాడుకోండి!'' అన్నది.

''రాణీ, నా సొత్తంటూ ఏమీ లేనప్పుడు దాన్ని నేను పోగొట్టుకోవటం ఎలా జరుగుతుంది?'' అన్నాడు మహాజనకుడు.

ఆయన కదిలి ఉత్తర ద్వారం గుండా నగరం దాటి వెళ్ళాడు. రాణీ, ప్రజలూ రాజు

జాతక కథ



వెంటపడ్డారు. వారు తన వెంటరాకుండా చేయటానికి గాను ఆయన వెనక్కు తిరిగి ప్రజలతో, ''ఈ నగరానికి అధిపతి ఎవరు?'' అన్నాడు.

''మీరే మహారాజా!'' అన్నారు ప్రజలు.

''అయితే, ఈ గీత దాటివచ్చిన వారిని దండించండి!'' అంటూ ఆయన తన దండం తీసి దారికి అడ్డంగా ఒక గీత గీసి ముందుకు వెళ్ళాడు. కొంతసేపు ఎవరూ గీత దాటలేదు. కానీ తన భర్త వెళ్ళిపోతున్నాడన్న ఆవేదనలో సీవలీదేవి గీత దాటి ముందుకు పరిగెత్తింది. వెంటనే ప్రజలు కూడా దాటారు.

త్వరలోనే రాణి తన భర్తను కలుసుకుని, ఆయనకాళ్ళపై బడి, ''ఈ ప్రజలను చూడండి. మీరు వెనక్కు తిరిగి రావాలని వారంతా కోరుతున్నారు! వారి కోరికను మన్నించండి,'' అన్నది.

''నేను వారందరినీ విసర్జించాను. చివరకు స్నేహితులనూ, చుట్టాలనూ, నా ఇంటినీ, దేశాన్నీ, సమస్తాన్నీ త్యజించాను!'' అన్నాడు మహారాజు.

''మీరు సన్యసిస్తే నా గతి ఏం కాను?'' అన్నది రాణి.

''నీ కుమారుడు మనోవాక్కాయ కర్మలా పాపం ఆచరించకుండా, ధర్మ బద్ధంగా రాజ్య పాలన చేసేటట్టు చూడు,'' అన్నాడు రాజు.

వారు మాట్లాడుతూ నడిచిపోతూండగా సూర్యాస్తమయం అయింది. ఆ రాత్రికి ఒక సముచిత ప్రదేశంలో మజిలీ ఏర్పాటయింది. తిరిగి తెల్లవారగానే మహాజనకుడు లేచి ప్రయాణం సాగించాడు. రాణి తనతో ఉన్న పరివారాన్ని వెనకగా రమ్మని, తాను మటుకు తన భర్త వెంబడే నడవ సాగింది.

పోయి పోయి వారొక నగరాన్ని చేరారు. నగర ద్వారం వద్ద కొందరు పిల్లలు ఆడుకుంటున్నారు. ఒక ఆడపిల్ల చేటతో ఏదో చెరుగుతున్నది. ఆమెకు ఒక చేతికి ఒక గాజూ, రెండవ చేతికి రెండు గాజులూ ఉన్నాయి. ఆమె చేట చెరిగినప్పుడల్లా ఒక చేతి గాజులు చప్పుడు చేస్తున్నాయి.

ఇది చూడగానే మహాజనకుడికి ఒక ఆలోచన తట్టింది. ఆయన తన భార్యకొక చిన్న పాఠం నేర్పి ఇంటికి పంపేద్దామనుకుని, ఆ పిల్లతో, ''అమ్మాయీ, నీ చెయ్యి ఒకటి

చప్పుడు చేస్తుందేం? రెండవది చెయ్యదేం?'' అన్నాడు. దానికా పిల్ల, ''అయ్యా, ఈ చేతికి రెండు గాజు లుండటం చేత చప్పుడు చేస్తున్నాయి. రెండవది అనర్థం!'' అన్నది.

రాజు సీవలీదేవి కేసి తిరిగి, ''ఆ పిల్ల అన్న మాట విన్నావా? రెండవది అనర్థం! నిన్ను నేను వెంట రానిస్తే ఈ పిల్ల చెప్పిన నీతిని తప్పిన వాణ్ణవుతాను!'' అన్నాడు.

రాణి అందుకు తల వంచుకుని, తన భర్తను ముందుకు సాగి వెళ్ళనిచ్చింది. కానీ మరుక్షణమే ఆమెకు దుఃఖం పొంగి వచ్చింది. వెంటనే ఆమె పరిగెత్తి తన భర్తను కలుసుకుని ఆయనతోబాటు నడవసాగింది. వారు కొంత దూరం నడిచి ఒక కమ్మరి కొలిమి దగ్గిరికి వచ్చారు.

అక్కడ కమ్మరి బాణం తయారు చేస్తున్నాడు. బాణం సూటిగా ఉన్నదో లేదో చూడటాని కతడు బాణాన్ని తన కంటికి ఎదురుగా పట్టుకుని రెండవ కన్నును మూసుకున్నాడు.

''నాయనా, చూడటానికి నీకు రెండు కళ్ళుండగా ఒకదాన్ని మూస్తావెందుకు?'' అని రాజు కమ్మరిని అడిగాడు. ''రెండు కళ్ళనూ తెరిచి చూస్తే సూటి తెలుస్తుందా, బాబూ? బాణం వంకరగా ఉందో లేదో చూడాలంటే ఒక కన్నుతోనే చూడాలి. రెండవది అనర్థం!'' అన్నాడు కమ్మరి.

''విన్నావా, దేవీ?'' అన్నాడు మహాజనకుడు తన భార్యతో. తన భర్త ఇక తనకు దక్కడని సీవలీదేవికి తెలిసిపోయింది. ఆ బాధతో ఆమె స్పృహతప్పి పడిపోయింది. ఆ సమయంలో మహాజనకుడు అరణ్యంలో ప్రవేశించి ఎటో వెళ్ళిపోయాడు.

త్వరలోనే పరివారం వచ్చింది. మూర్ఛపోయిన రాణి ముఖంపై నీరు చల్లి మూర్ఛ తేర్చారు. ఆమె మౌనంగా మిథిలా నగరానికి తిరిగి వెళ్ళి, తన కుమారుడైన దీర్ఘాయువును రాజ్యాభిషిక్తుణ్ణి చేసింది.

ఆమె తిరిగి రాజభవనంలో అడుగు పెట్టలేదు. తోటలో ఒక పర్ణశాల కట్టుకుని సన్యాసినిలాగా జీవించింది.

మహాజనకుడు హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసి సిద్ధి సంపాదించాడు.



స్థానిక అమెరికన్ జానపద కథ

# నడిరేయి మెరుపుదాడి!

ఒకానొకప్పుడు ఉత్తర అమెరికాలోని పెనోబ్‌స్కాట్ గ్రామంలోని వాబనాకీ తెగవారికీ, మొహాక్ తెగలకూ మధ్య తరచూ భయంకర పోరాటాలు, కొట్లాటలు జరుగుతూ ఉండేవి. ఆ కాలఘట్టంలోనే మొహాక్‌లు పెనోబ్‌స్కాట్ గ్రామంపై దాడి చేసి మెనగాన్ అనే యువతిని అపహరించుకుని వెళ్ళారు. ఒకనాడామె వంటచెరకు సేకరించుకుని మొక్కజొన్నతోటగుండా వెళుతూండగా ఆమెకు తెలుపు ఎరుపు బెల్టు కనిపించింది. అది తాను తన భర్త పుల్వాఫ్ కోసం అల్లి ఇచ్చిన బెల్టు అని గుర్తించడంతో ఆమె మనసు ఆనందంతో ఉప్పొంగింది.

తనకేదో సంకేతం అందివ్వడానికే తన భర్త ఆ బెల్టును అక్కడ పడవేసి ఉంటాడని ఆమె గ్రహించింది. ఏమై ఉంటుందా అని తీవ్రంగా ఆలోచించింది. బహుశా ఈ బెల్టు పడి ఉన్నచోట వేచి ఉంటే భర్త వచ్చి కలుసుకోవచ్చునని ఆశతో ఊహించింది. ఆ ఊహే ఆమెకెంతో సంతోషాన్నిచ్చింది. అయితే, శిబిరాన్ని సమీపించగానే, ఖైదీలాగా దీనమైన చూపులతో తల దించుకుని అడుగులు వేయసాగింది. అక్కడివారికి అనుమానం కలగకూడదుకదా!



మెనగాన్ ఏదో నెపం మీద తలుపు వద్ద కూర్చున్నది. రాత్రి కాగానే మొహాక్‌లు భోజనాలు ముగించి నిద్రకు ఉపక్రమించారు. కాపలా భటులు లేరు గనక తప్పించుకోవడం సులభం అని మెనగాన్ భావించింది.

అయితే, హఠాత్తుగా రణగొణ ధ్వనులు వినిపించడంతో ఉలిక్కిపడింది. ఆరుగురు మొహాక్ వీరులు ఆమె భర్త పుల్వాఫ్, అతడి సోదరుడు ఇద్దరినీ ఖైదీలుగా పట్టుకుని లాక్కొస్తున్నారు. పుల్వాఫ్ ఆమెను గుర్తించనట్టే దాటుకుని వెళ్ళిపోయాడు. ఆమె కూడా అతడు తెలియనట్టే మసలుకోవాలని నిర్ణయించింది.

మొహాక్ నాయకుడు ఆమెను పిలిచి, ''వీళ్ళు వాబనాకీ మాండలికం మాట్లాడుతున్నారు. నువ్వు వాళ్ళతో మాట్లాడి ఇక్కడ వాళ్ళెందుకు తచ్చాడుతున్నారో తెలుసుకో,'' అని ఆజ్ఞాపించాడు.

మెనగాన్ అతడు చెప్పినట్టు చేసింది. పుల్వాఫ్ హేళనగా నవ్వుతూ, 'మొహాక్‌లు నాలుగు నెలల క్రితం మా చోటును పావనం

చేశారు. ఆ అభిమానాన్ని తిరిగి చెల్లించడానికి మేము ఇప్పుడు వచ్చాం,'' అన్నారు.

ఆ మాట మెనగాన్ తెలియజేయడంతో మొహాక్‌లు కలత చెందారు. పగ తీర్చుకోవడానికి వీరులతో మోహరించి ఉన్నామని చెప్పే తెగల సంకేత భాష అది!

యుద్ధానికి ఎంత మంది వచ్చారో, ఎక్కడ మకాం ఏర్పరచుకున్నారో ఆరా తీయమని నాయకుడు మెనగాన్‌ను పురమాయించాడు. కాని ఆ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి పుల్వాఫ్ తిరస్కరించాడు. నాయకుడు, ''వీళ్ళను గుంజలకు కట్టేయండి. పొద్దున వచ్చి చూస్తాను.'' అని చెప్పి వెళ్ళిపోయాడు.



ఆ మాట విన్న, మొహాక్‌ల వెంట నడుస్తూన్న మెనగాన్ మనసు బాధతో విలవిలలాడింది! పుల్వాఫ్, అతడి సోదరుడు మాత్రమే వచ్చారేమో అన్న అనుమానం ఆమెకు కలిగింది. సూర్యోదయం కల్లా వీరులు వచ్చి మొహాక్‌ల మీద దాడి చేయకపోతే ఆ ఇద్దరికీ ప్రాణాపాయం తప్పదు!

మెనగాన్ మళ్ళీ తలుపు వద్ద కూర్చున్నది. ఇప్పుడామె వేళ్ళు వణుకుతున్నాయి. ఆమె కుడి చెవి వద్ద దోమ గుయ్‌మన్నది. మెనగాన్ బాధతో దాన్ని అవతలికి తరమ చూసింది. అయితే, ఆ దోమ ఓ పట్టాన వెళ్ళలేదు. ఆమె ఎడమ చెవి వద్దకు వచ్చి, ''మెనగాన్ నేను మీకు సాయపడడానికి వచ్చాను. నేను చెప్పినట్టు చేశావంటే మీ ముగ్గురూ క్షేమంగా బయటపడగలరు,'' అన్నది. ఆ దోమ మాట్లాడడం చూసి మెనగాన్ ఆశ్చర్యపోయింది. అయినా, ఎవరు ఎలాంటి సాయం అందించినా దొరకపుచ్చుకోవలసిన విపత్కర పరిస్థితిలో ఆమె ఉన్నది. సాయం అందించేది దోమే అయినా దాన్ని ఉదాసీన పరచకూడదు.

''వెళ్ళి మొహాక్‌ల పాదుకలు(మొకాసిన్స్) తీసుకొచ్చి దాచెయ్. తలుపులకు అడ్డంగా తాళ్ళు కట్టెయ్. ఆ తరవాత వెళ్ళి ఖైదీలను విడిపించు. వాళ్ళను ద్వారం దగ్గరకు వెళ్ళి పెడబొబ్బలు పెట్టమని చెప్పు. నిప్పుల మీద నీళ్ళు పోసి ఆర్పేసి వెళ్ళి వాళ్ళను కలుసుకుని పారిపో!'' అన్నది దోమ మళ్ళీ.



మెనగాన్ ఇక ఆలస్యం చేయకూడదను కున్నది. పిల్లిలా అడుగులు వేసుకుంటూ రహస్యంగా శిబిరంలోకి వెళ్ళి పాదుకలను సేకరించి తెచ్చి లేళ్ళ చర్మం అడుగున దాచేసింది. ప్రతి ద్వారానికి అడ్డుగా పచ్చి చర్మం తాళ్ళను కట్టింది. నేల మీద పదునైన రాళ్ళను చెల్లాచెదరుగా వేసింది. ఆ తరవాత ఖైదీల వద్దకు పరిగెత్తుకుపోయి, కట్లు విప్పి వాళ్ళను విడిపించి, చెవుల్లో పథకం గురించి చెప్పింది. ఆ తరవాత నీళ్ళతో మంటలన్నిటినీ ఆర్పసాగింది. మంటలు ఆరే శబ్దానికి మొహాక్‌లు నిద్రమేల్కొన్నారు. మెనగాన్ వెలుపలికి వచ్చేసింది. అదే సమయంలో పుల్వాఫ్, అతడి సోదరుడు వంట చెరకు కోసం ఉంచిన దృఢమైన కర్రలను అందుకున్నారు. దిక్కులు పిక్కటిల్లేలా కేకలు పెడుతూ అందిన వాటిని అందినట్టు చితక బాదసాగారు. ఈ శబ్దాలకు మేల్కొన్న పిల్లలు ఏడ్వసాగారు. కుక్కలు పిచ్చెక్కినట్టు మొరగసాగాయి. హఠాత్తుగా సైనికులు విరుచుకుపడి దాడి చేస్తున్న వాతావరణం అలముకున్నది.

పాదుకల కోసం వెతుకుతూ మొహాక్‌లు అటూ ఇటూ పరిగెత్తారు. అవి అక్కడ కనిపించకపోవడంతో హతాశులయ్యారు. వెలుపలికి వచ్చి పదునైన రాళ్ళు కాళ్ళకు గుచ్చుకోవడంతో నిలబడలేక బాధతో పైకీ కిందికీ గెంత సాగారు. పొగ మంచు కురిసే చీకటి రాత్రి. అంతా గందరగోళం. ఒకరిని ఒకరు గుద్దుకున్నారు. కొందరు ద్వారం కేసి పరిగెత్తిపోయి, అక్కడ నిలబడ్డ మెనగాన్, వాళ్ళ మనుషుల దెబ్బలకు నేలకు ఒరిగారు. ఒక్కొక్కరుగా అందరూ వెల్లకిలా పడిపోయి నిస్సహాయంగా ఆకాశంలోని నక్షత్రాలకేసి చూడసాగారు.

మెనగాన్, ఆమె భర్త, అతడి తమ్ముడు అందుబాటులో ఉన్న దోనెలో తమ గ్రామానికి చేరుకున్నారు. ఆ తరవాత ముక్కుతూ మూలుగుతూ లేచి నిలబడ్డ మొహాక్‌లు ప్రాణాలతో బయటపడ్డందుకు సంతోషపడ్డారు. హఠాత్తుగా విరుచుకుపడిన పెనోబ్స్కాట్ వీరుల దండును సమర్థవంతంగా ఎదుర్కొని నిలబడగలిగినందుకు సంతోషంగా ఒకరినొకరు అభినందించుకున్నారు. ఇంతకూ ఆ సైన్యం ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ మాత్రమేనన్న విషయం వాళ్ళకు అసలు తెలియనే తెలియదు!

సరే, ఈ దాడిలో కీలక పాత్ర వహించిన దోమ ఎవరా అని ఆలోచిస్తున్నారు కదూ? అది వేరెవరో కాదు. వాబనాకీ తెగ ప్రజలు భక్తితో కొలిచే మంత్ర శక్తులు గల దేవుడు మహానేత గ్లూస్కాప్! మెనగాన్, ఆమె భర్త, అతడి సోదరుడు మొహాక్ తెగల చెర నుంచి బయటపడడానికి సాయమందించేందుకు దోమ రూపంలో వచ్చాడన్న మాట!




# రామాయణం

రావణుడు అశోకవనాన్ని చేరేసరికి, సీత దుఃఖంతో రాముణ్ణి గురించి ఆలోచిస్తూ, నేల పైన కూర్చుని తల వంచుకుని ఉన్నది. రావణుడు సీతను సమీపించి, ''నువ్వు ఏ రాముణ్ణి చూసుకుని గర్విస్తున్నావో ఆ రాముడు యుద్ధరంగంలో చచ్చాడు. ఇక నువ్వు నా భార్యవు కాక గత్యంతరం లేదు. పాపం ఆ రాముడు నన్ను చంపుదామని పెద్ద వానరసేనతో వచ్చి సముద్రపు ఉత్తర తీరాన విడిశాడు. అందరూ బడలి ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న సమయంలో మా చారులు వెళ్ళి అన్ని సంగతులూ చూసి వచ్చారు. అప్పుడు మా ప్రహస్తుడు గొప్ప రాక్షస సేనతో వెళ్ళి, వానరసేనపై ఆయుధాల వర్షం కురిపించి, నిద్రపోతున్న రాముడి తల నరికేశాడు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ తప్పించుకుని పారిపోయారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, అంగదుడూ మొదలైన వానర వీరులంతా చచ్చారు,'' అన్నాడు.

ఆ తరవాత రావణుడు ఒక రాక్షసస్త్రీతో, ''రాముడి శిరస్సును యుద్ధరంగం నుంచి తెచ్చిన విద్యుజ్జిహ్వుణ్ణి రమ్మను,'' అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి శిరస్సునూ, బాణాస్నీ తెచ్చి, రావణుడి ఆజ్ఞపై వాటిని సీత ముందుంచి చప్పున వెనక్కు వచ్చేశాడు.

తన ముందున్న తలలో కళ్ళూ, జుట్టూ, చూడామణీ గుర్తించి సీత నిజంగా రాముడు చనిపోయాడనే అనుకుని దుఃఖ సముద్రంలో పడి కొట్టుకున్నది. ఆమె కైకేయిని తిట్టుకున్నది, తనను పెళ్ళాడటం చేతనే రాముడికీ

యుద్ధ కాండ-5



దురవస్థ వచ్చిందని తనను తాను నిందించుకున్నది. తన తలను రాముడి తలతోనూ, తన శరీరాన్ని రాముడి శరీరంతోనూ చేర్చమని రావణుణ్ణి వేడుకున్నది.

అంతలోనే ద్వారపాలకుడు అక్కడికి వచ్చి రావణుడితో, ప్రహస్తుడు మొదలైన మంత్రులందరూ రావణుడి దర్శనం కోసం వేచి ఉన్నట్టు చెప్పాడు. రావణుడు బయలుదేరి సభకు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాముడి తలా, ధనుస్సూ అంతర్ధానమయిపోయాయి.

విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చి ఊరడిస్తూ, ''రాముడు వానర సేనతో సముద్రం దాటి దక్షిణ తీరానికి వచ్చాడు. ఆ సంగతి తెలిసే మంత్రులతో మాట్లాడటానికి రావణుడు పరిగెత్తి వెళ్ళాడు. రావణుడి మాయలు నమ్మకు,'' అన్నది.

రావణుడక్కడ కొలువులో సభ చేసి తన సైన్యాధ్యక్షులతో, ''తక్షణమే భేరి వేసి రాక్షస సైన్యాలను అయ్యత్త పరచండి. కారణం చెప్పవద్దు,'' అన్నాడు.

ఆ భేరి మోత సీతకూ, సరమకూ వినిపించింది. ''చూశావా, రాక్షస సేనలు యుద్ధానికిప్పుడే కదులుతున్నాయి,'' అన్నది సరమ సీతతో. సీతకు ప్రాణం లేచి వచ్చింది. సరమ సీతతో, ''కావాలంటే నేనిప్పుడే రాముడి వద్దకు వెళ్ళి, నువ్వు క్షేమంగా ఉన్నావని చెప్పి రాగలను, ఏమంటావు?'' అని అడిగింది.

''నా కోరిక తీర్చాలని ఉంటే, రావణుడేం చేస్తున్నాడో తెలుసుకుని రా,'' అన్నది సీత.

సరమ వెళ్ళి వచ్చి, ''రావణుడికి అతడి తల్లీ, అవిద్ధుడనే ముసలి మంత్రీ ఎంతగానో చెప్పారు నిన్ను విడిచిపుచ్చమని. కానీ రావణుడు వారి మాటలు వినక, తాను జీవించి ఉండగా నిన్ను విడవనని మంత్రులతో ఆలోచన చేస్తున్నాడు. అతనికి చావు తప్పదు,'' అన్నది.

ఈ సమయంలో వానరసేనలు చేసే సింహనాదాలు దగ్గిరలో భయంకరంగా వినవచ్చాయి. ఆ ధ్వనులు విని రాక్షసులు తెల్లబోయారు. రావణుడిసభలోని వారు కూడా వాటిని విన్నారు.

''రాముడు సముద్రం దాటి రావటమూ, అతని బల పరాక్రమాలు విని మీరంతా దిగాలుపడిపోవటమూ నేను గ్రహించాను,'' అని రావణుడు సభికులతో అన్నాడు.

అప్పుడు రావణుడి తల్లి తాలూకు బంధువు అయిన మాల్యవంతుడనే వృద్ధరాక్షసుడు, ''రాజా, మన కన్నా బలహీనుడితో యుద్ధం,



బలవంతుడితో సంధి చెయ్యాలన్నది రాజ నీతి. మన పక్షాన అధర్మం ఉన్నందున మనం బలహీనులంగా ఉన్నాం. అందుచేత మనం రాముడితో సంధి చేసుకుని, సీతను అతడి కిచ్చివెయ్యటం యుక్తం. మన మధ్య కలహ కారణం సీతే గద. యుద్ధం నీకు కూడా క్షేమం కాదు. అనేక మందిచేత చావు లేకుండా వరం పొందావు గానీ, ఇప్పుడు మన పైకి ఎత్తి వచ్చిన మనుషులూ, వానరులూ, కొండముచ్చులూ, ఎలుగుగొడ్డులూ మొదలైన వారిచేత చావు లేకుండా వరం పొంది ఉండలేదు. శకునా లేవీ బాగాలేవు,'' అన్నాడు.

ఈ సలహా విని మండిపడి రావణుడు మాల్యవంతుడితో, ''కోతులను వెంటబెట్టు కుని వచ్చిన రాముడు రాక్షస బలాలుగల నాకంటేఎక్కువ బలం గలవాడని ఏ ఆధారంతో చెప్పావు? బెత్తెడు సముద్రానికి వారధి కట్టగానే రాముడు మహాబలుడయిపోయాడా? పని పెట్టుకుని సీతను తెచ్చుకున్న నేను, రాముడికి భయపడిపోయి ఆమెను తిరిగి ఇచ్చెయ్యనా? ఒకవేళ రాముడు నా కన్న బలవంతుడైతే నా తల నరకనీ. అంతేగాని, నేనతనికిలొంగిపోను. అది నా స్వభావానికి వ్యతిరేకం. ఇక్కడికి వచ్చి తిరిగి ప్రాణాలతో వెనక్కొలా పోతామా అని రాముణ్ణి భయపడనీ,'' అన్నాడు.

ఈ మాటలు విన్న మాల్యవంతుడు సిగ్గు పడి తల వంచుకున్నాడు. రావణుడు తన మంత్రులతో ఆలోచించి నగర రక్షణ ఏర్పాట్లు చేశాడు. దక్షిణద్వారాన మహోదర మహాపార్శ్వు లుంచబడ్డారు. పడమటి ద్వారానికి ఇంద్రజిత్తు నియోగించబడ్డాడు. ఉత్తర ద్వారానికి శుకసా రణులతోసహా రావణుడేస్వయంగావెళ్ళాడు. తూర్పున ప్రహస్తు డుంచబడ్డాడు. విరూ పాక్షుడు పట్టణ మధ్య ప్రాంతంలో అనేక మంది రాక్షస వీరులతో ఉండిపోయాడు.

లంకానగర రక్షణ గురించి రావణుడు చేసిన ఈ ఏర్పాట్లను విభీషణుడి నలుగురు మంత్రు లూరహస్యంగా పక్షిరూపాలలో వచ్చి తెలుసు కుని, తిరిగి వెళ్ళి విభీషణుడికి వివరించి చెప్పారు. విభీషణుడా వివరాలను రాముడికి చెప్పాడు. వెంటనే రాముడు లక్ష్మణ సుగ్రీవు లతోనూ, హనుమంత జాంబవంతాది వీరుల తోనూ, సమాలోచన చేసి, లంకానగరంపైకి ఏవిధంగా దాడిచేయాలనేది నిర్ణయించాడు.

నీలుడు కొంతవానరసేనతో తూర్పు ద్వారానికి వెళ్ళి ప్రహస్తుడితో యుద్ధం [illegible]



దుడు దక్షిణ ద్వారం వద్ద మహాపార్శ్వ, మహోద రులతో యుద్ధం చెయ్యాలి. హనుమంతుడు పడమటి ద్వారం పైకి పోతాడు. రావణుడు స్వయంగా రక్షించే ఉత్తర ద్వారంమీదికి రామ లక్ష్మణులు వెళ్ళాలని నిశ్చయమయింది. నగర మధ్యలోని బలాలతో పోరాడవలసిన వారు సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూనూ.

రాముడు పెట్టిన మరొక నియమమేమంటే యుద్ధం చేసే సమయంలో రామలక్ష్మణ, నీల, అంగద, హనుమంత, సుగ్రీవులూ; విభీష ణుడూ తప్ప, మరెవరూ నరరూపాలు ధరించ రాదు. గుర్తు తెలియడానికి వారు వానర రూపాలతోనే ఉండాలి.

ఈవిధంగా నిర్ణయం జరగగానే రాముడు సువేల పర్వతం పైకి దారి తీశాడు. అతడి వెంట లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, ఇతర వానర ప్రముఖులూ కొండ ఎక్కసాగారు. వారు సువేల పర్వతం పైకి చేరేసరికి లంకానగరం ఎదురుగా కనిపించింది. ప్రాకారాల మీదా, ద్వారాల వద్దా నల్లని రాక్షసులు సాయుధులై, యుద్ధసన్నద్ధులై నిలబడి ఉన్నారు. వారిని చూసి వానరులు సింహనాదాలు చేశారు. ఆ సమయంలో సూర్యుడస్తమించి, పూర్ణచంద్రు డుదయించాడు. రాముడు మొదలైన వారంతా సువేల పర్వతం పైన ఆ రాత్రి విశ్రాంతి తీసు కున్నారు.

మర్నాడు ఉదయం వానరులు సువేల పర్వతం మీది వనాలలో విహరించబోయారు. రాముడు లక్ష్మణుడితోనూ, వానర ప్రముఖుల తోనూ సువేల పర్వతం పైనుంచి–త్రికూట పర్వతం మీద నిర్మించి ఉన్న లంకానగరపు శోభను చూసి ఆశ్చర్యపోయాడు. భవనాలూ, ప్రాకారాలూ, గోపురాలూ, రక్షణలూ అతనికి విస్మయం కలిగించాయి.

అతనికి అప్పుడే రావణుడు కూడా కని పించాడు. అతనికి వింజామరలు వీస్తున్నారు, శ్వేతచ్ఛత్రం పట్టారు. మనిషి నల్లగా ఉన్నాడు. రక్త చందనం శరీరానికి పూసుకుని వెలలేని రత్నాభరణాలు ధరించి ఉన్నాడు. చాలా బరు వైన ఎర్ర జరీబట్టలను కట్టుకున్నాడు.

అందరితో బాటు రావణుణ్ణి చూస్తున్న సుగ్రీవుడికి ఉన్నట్టుండి పట్టరాని కోపం వచ్చింది. అతను ఒక్క ఊపున సువేల పర్వత శిఖరం నుంచి రావణుడున్న గోపురం మీదికి దూకి, రావణుడికేసి తీక్షణంగా చూసి, గాలి లోకి ఎగిరి రావణుడి కిరీటాన్ని తన్ని మళ్ళీ

నేలపై వాలాడు. రావణుడు కోపంతో లేచి సుగ్రీవుణ్ణి తన చేతులతో పడదోశాడు. సుగ్రీవుడు బంతిలాగా పైకి లేచి రావణుణ్ణి పడదోశాడు. ఇద్దరూ కలియబడి చాలాసేపు భయంకరంగా కొట్టుకున్నారు. చివరకు రావణుడు అలిసి మాయా యుద్ధానికి దిగుదామనుకుంటూ ఉండగా, ఆ సంగతి గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను మళ్ళీ వస్తాడని రావణు డనుకున్నాడు గానీ, సుగ్రీవుడు తిరిగి రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, ''సుగ్రీవుడా, నువ్వు రాజువై ఉండి, ఇలాంటి అపాయకరమైన పని తొందరపాటున చెయ్యగూడదు. మేమందరమూ చాలా కలతపడ్డాం. నీకు అపాయం జరిగి ఉంటే మా అందరి పనీ ఏమై ఉండేది?'' అన్నాడు.

''నీ భార్యను ఎత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు ఎదురుగా కనిపిస్తూ ఉంటే సహించలేకపోయాను,'' అన్నాడు రాముడితో సుగ్రీవుడు.

అప్పటికప్పుడే అందరూ సువేల పర్వతం దిగి, వానరబలాలతో సహా త్రికూట పర్వతం ఎక్కారు. వానరులు లంకానగరాన్ని ముట్టడించారు. రాముడు నిర్దేశించిన ప్రకారం ఏ ద్వారం వద్ద యుద్ధం చెయ్యవలసిన వానర యోధులా ద్వారం వద్ద నిలబడ్డారు.



అప్పుడు రాముడు అంగదుణ్ణి పిలిచి, ''అంగదుడా, నువ్వు నిర్భయంగా లంకాప్రాకారం దాటి, రావణుడుండే చోటికి వెళ్ళి, నా మాటలుగా ఇలాచెప్పు: రావణుడా, నా భార్యను అపహరించిన నిన్ను శిక్షించటానికి యముడు లాగా నేను వచ్చాను. ఏ బలం చూసుకుని నన్ను మోసపుచ్చి సీతను ఎత్తుకు పోయావో ఆ బలాన్ని ఇప్పుడు చూపించు. నువ్వు సీతను తెచ్చి నాకు సమర్పించి నాశరణు వేడని పక్షంలో నిన్నూ, నీ రాక్షస కులాన్నీ నాశనం చేసి, లంకకు విభీషణుణ్ణి రాజుగా చేస్తాను.

## చందమామ ఘర్‌కా ట్వెంటీ-20 క్రికెట్ సమాధానాలు:

1. స్టీఫెన్ ఫ్లెమింగ్ 2. 8 నుంచి 10కి 3. ముంబై ఇండియన్స్ 4. చెన్నయ్ సూపర్ కింగ్స్, రాజస్థాన్ రాయల్స్, డెక్కన్ చార్జర్స్ 5. హర్భజన్ 6. పిసిఎ స్టేడియం 7. రాయల్ ఛాలెంజర్స్ బెంగళూరు 8. కొల్‌కతా నైట్‌రైడర్స్ 9. ముంబై ఇండియన్స్ 10. ఢిల్లీ డేర్‌డెవిల్స్ 11. పూమా 12. సోహాయిల్ తన్వీర్.

నీకు రాజ్యార్హత పోయింది. నన్ను శరణు వేడని పక్షంలో నాతో యుద్ధానికి వచ్చి, నా చేత చచ్చి పవిత్రుడివికా?'' అన్నాడు.

అంగదుడీసందేశం పుచ్చుకుని ఆకాశంలోకి ఎగిరి లంకలో వాలి, రావణుడు తన ఇంట మంత్రులతో కూర్చుని మాట్లాడుతున్న చోటికి వెళ్ళి, రావణుడి పక్కన నిలబడ్డాడు. అతడు రావణుడికి తానెవరో చెప్పుకుని, రాముడు చెప్పమన్న మాటలు, ఒక్క ముక్క పొల్లు పోకుండా, రావణుడికి వినిపించాడు.

ఆ మాటలు వినేసరికి రావణుడు కోపం పట్టలేక, ''ఈ అంగదుణ్ణిచంపెయ్యండి,'' అని మళ్ళీ మళ్ళీ కేకలు పెట్టాడు. నలుగురు రాక్షసులు అతన్ని పట్టుకుందామని వచ్చారు. అంగదుడు వారిని దగ్గిరదాకా రానిచ్చి, వారిని తన చంకల్లో ఇరికించుకుని, ఒక్క ఎగరున రావణుడి ఇంటి ప్రాకారం మీదికివెళ్ళి వాలాడు. కొండంత ఎత్తున ఆ ప్రాకారం మీద అతను వాలేటప్పుడు రాక్షసులు కిందపడిపోయారు.

ఆ ప్రాకారం మీద ఉన్న గోపురం అంగదుడి కంట పడింది. అంగదుడా గోపురాన్ని కాలితో ఒక్క తన్ను తన్నేసరికి అది విరిగి పడిపోయింది.

చందమామ రామాయణం క్విజ్

అశోకవనంలో సీతను ఓదార్చిన విభీషణుడి భార్య పేరు:

a. తార b. సరమ c. మందోదరి

మీ సమాధానాన్ని CRQ <a/b/c> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.




అంగదుడు తన పేరు అందరికీ వినబడేటట్టు చెప్పి ఎగిరివెళ్ళి రాముడి చెంత వాలాడు.

ఇంతలో కొందరు రాక్షసులు వచ్చి, లంకను వానరసేనలు ముట్టడించినసంగతి రావణుడికి చెప్పారు: రావణుడు ఆగ్రహావేశుడై తన నగరాన్ని ముట్టడించిన వానరులను చూడటానికై ప్రాసాదం మీదికి వచ్చాడు. వానరులు భూమినంతా ఆక్రమించి ఉండటం చూసి అతను ఆశ్చర్యపోయాడు.





# కేశవతి తలకట్టు

సోనాపూరు రాజకుమార్తె కేశవతి చాలా చక్కనిది. పన్నెండేళ్ల వయసు గల కేశవతిలో అన్నిటినీ మించిన ఆకర్షణ ఆమె తలకట్టు. ఆమె వెంట్రుకలు ఒత్తుగానూ, నల్లగానూ, చాలా పొడవుగానూ ఉండేవి. అందుచేత ఆమె తలకట్టు గురించి రాజ్యమంతటా గొప్పగా చెప్పుకునేవారు.

ఒక్కతే బిడ్డ కావటంచేత రాజదంపతులు కేశవతిని ఎంతో శ్రద్ధగా పెంచేవారు. అందులోనూ రాణి తన కుమార్తెకు తల దువ్వటమూ, కేశాలంకరణ చెయ్యటమూ మొదలైన పనులను దాసీలకు అప్పగించక, తానే స్వయంగా చేసేది. ఆమె కేశవతి జుట్టుకు స్వచ్ఛమైన కొబ్బరినూనె మాత్రమే వాడేది.

ఒకనాడు కేశవతి నూనె గానుగకు వెళ్లి, ఎద్దులు గానుగను తిప్పటమూ, కొబ్బరి ఆ గానుగలో నలగటమూ, గానుగ దిగువనుంచి నూనె పిడతలోకి బొట్లు బొట్లుగా పడుతూ ఉండటమూ చూసింది. ఇదంతా చూస్తూ ఉంటే ఆమెకు నూనె మీద రోత పుట్టింది. ఇంతలో ఆ గానుగ మీదికి పాకి వచ్చిన బల్లి ఒకటి గానుగలో జారి పడింది. అది చూసి కేశవతి కెవ్వున అరిచి మూర్ఛపోయింది.

అటు తరవాత ఆమెకు నూనె పైన చెప్పరాని అసహ్యం పుట్టుకొచ్చింది. ఆమె కొబ్బరి నూనెను తలకు రాసుకోవడానికి ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. తల్లి ఎన్నో విధాల చెప్పి చూసింది. తండ్రీ చెప్పి చూశాడు. కానీ ప్రయోజనం లేకపోయింది. పోనీ, ఇంకేదైనా నూనె రాసుకోమన్నారు. కానీ ఆమెకు అన్ని నూనెల మీదా రోత పుట్టింది. ఆమె జుట్టు కళాహీనమై పోయి, నిగనిగలాడటం మానేసింది.

''నువ్వు కొంచెం కూడా గ్రహించకుండా ఉన్నావు, తల్లీ,'' అన్నది తల్లి.

**25-ఏళ్ళనాటి చందమామ కథ**



‘‘అంతా గ్రహించాను. నేను అసలు నూనె రాసుకోను,’’ అన్నది రాణి.

కేశవతి ఒక మొక్కకు నీరు బదులు నూనె పొయ్యనారంభించింది. త్వరలోనే ఆ మొక్క కాస్తా చచ్చింది. దాన్ని చూపించి, ‘‘చూశావా, అమ్మా? పెరగటానికీ, నూనెకూ ఎలాంటి సంబంధమూ లేదు,’’ అన్నది కేశవతి తల్లితో.

రాణి ఇంకేం మాట్లాడుతుంది?

ఆస్థాన వైద్యులు వచ్చి, ఆయుర్వేదంలో నుంచి శ్లోకాలు చదివి, జుట్టుకు నూనె కావాలన్నారు. కానీ కేశవతి నిర్ణయాన్ని మార్చటం వాళ్లకూ సాధ్యం కాలేదు. ఈ వార్త త్వరలోనే రజతపురానికి చేరింది. రజతపురం సోనాపురానికి పొరుగున ఉన్నది. ఇద్దరు రాజులూ మిత్రులు. కేశవతిని రజతపుర రాజకుమారుడు కాంచనుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యాలని ఏనాడో నిర్ణయం కూడా జరిగింది.

ఇప్పుడు కాంచనుడు పద్దెనిమిదేళ్ల యువకుడు, అనేక విద్యలలో ఆరితేరాడు. తన కాబోయే భార్య గురించి విని, అతను ఆమె మనసు మార్చేటందుకు తాను కూడా ప్రయత్నం చేయ నిశ్చయించి, సోనాపుర రాజుకు కబురు పంపాడు. అతన్ని వెంటనే రమ్మన్నారు.

కాంచనుడు వస్తున్నట్టు విని కేశవతి చాలా సంతోషించింది. చిన్నతనంలో అతను తరచుగా వస్తూండేవాడు; ఇద్దరూ కలిసి సరదాగా ఆడుకునేవారు. ఇద్దరికీ వయసు వస్తున్న కొద్దీ వాళ్ల మధ్య చనువు తగ్గింది.

కాంచనుడు వచ్చాడు. అతను కేశవతితో కొత్తరకం వాదన ప్రారంభించి చూశాడు. ‘మెదడు చురుకుగా పనిచెయ్యటానికి నూనె ఎంత అవసరమో నీకు తెలీదా, కేశవతీ? అది మెదడుకు ఇంధనం!’’ అన్నాడు అతను.

''ఇలాంటి మాటలు చాలావిన్నాను, నేను నమ్మను. హరిశాస్త్రి పంతులు గారిది బట్టతల. ఆయన అసలు నూనే రాసు కోడు,'' అన్నది కేశవతి.

''ఇప్పుడు వాడకపోతేనేం? చిన్నప్పుడు ఆయన తప్పక నూనె వాడి ఉంటాడు,'' అన్నాడు కాంచనుడు.

''అందుకేఆయనకు బట్టతల అయింది,'' అన్నది కేశవతి తడువుకోకుండా.

''అతి చిన్న ప్రాణులైనా, చీమలు ఎంతో తెలివితేటలు గలవి. ఎక్కడయినా ఒక్క నూనె చుక్క కనిపిస్తే చాలు; ఎన్నో చీమలు దాని దగ్గర చేరి నూనె తాగేస్తాయి,'' అన్నాడు కాంచనుడు.

''అవును, నిజమే. చాలాసార్లు చూశాను. చక్కెర కోసం చీమలు మూగటం కూడా నేను చాలాసార్లు చూశాను. అందుచేత, నన్ను తలకు చక్కెరపాకం రాసుకుని, తెలివి పెంచు కోమంటావా? ఏమిటి నువ్వంటున్నది?'' అన్నది కేశవతి తాపీగా.

ఇక మాటలతో పని కాదనీ, ఇంద్రజాలం ప్రయోగించవలసిందేననీ నిర్ణయించుకుని, కాంచనుడు, ''మన చిన్నతనపు రోజులు ఎంత సరదాగా ఉండేవి! నీకు జ్ఞాపకం ఉందా, కేశవతీ?'' అని అడిగాడు.

''లేకేం! ఒకటే ఆటలు, ఒకటే సరదా!'' అన్నది కేశవతి.

''వెధవ నూనెకేం గాని, మళ్ళీ అలాటి ఆటలు ఆడుతుందామా?'' అని కాంచనుడు అడిగాడు.

''ఈ వయసులోనా? నీకేమైనా పిచ్చా?'' అన్నది కేశవతి.

''నువ్వు ఆడవద్దులే. నేను ఆడితే నువ్వు చూడటానికేం?'' అన్నాడు కాంచనుడు.

''ఓ, తప్పక చూస్తాను, వెనకటిలాగా నీ ఇంద్రజాలం చూపించు,'' అన్నది కేశవతి.

''నీకు రేపాక కొత్త ఇంద్రజాలం చూపి స్తాను. కానీ, ఒక షరతు.. అది నీకు నచ్చి నట్టయితే, నేను చెయ్యమన్న పని ఒకటి చెయ్యాలి. చేస్తావా?'' అని కాంచనుడు అడిగాడు.

''చేస్తాను,'' అన్నది కేశవతి.

మరుసటి రోజు ఉదయం కాంచనుడు రాజునూ, రాణీనీ, మంత్రులనూ వెంటబెట్టు కుని, ఇంద్రజాలం చూపటానికి కేశవతి



మందిరానికి వచ్చాడు. అతను బల్ల మీద ఒక విశాలమైన నీటి తొట్టెను ఉంచాడు. తరవాత అతను ఒక మందమైన అట్టముక్కనుంచి ఒక చేప ఆకారాన్ని కత్తిరించాడు. ఆ చేప ఆకారం నిడివి మూడు అంగుళాలూ, వెడల్పు అంగుళమున్నరా ఉన్నది. ఆ చేప నడుమ ఒక రంధ్రమూ, దాని వెంట ఒకచీలికా ఉండేటట్టు కత్తిరించాడు.

ఈ చేప ఆకారాన్ని రాజుకూ, రాణికీ, కేశవతికీ చూడమని ఇచ్చి, దానిని తొట్టెలోని నీటి మీద తేల్చి, ''కేశవతీ, ఈ చేప బొమ్మను చేత్తో తొయ్యకుండానూ, దాని మీద ఊదకుండానూ, ఈదేలాగా చెయ్యగలవా?'' అని అడిగాడు.

కేశవతి ముందుకు వచ్చి, చాలాసేపు చేపకేసి పరీక్షగా చూసి, తన వల్ల కాదన్నది.

'నేను చేసేది నీకు నచ్చితే, నేను కోరినట్టు చేస్తానని మాటయిచ్చావు. అది గుర్తున్నది గదా?'' అని కాంచనుడు అడిగాడు.

''గుర్తున్నది. నువ్వు చేసేదేదో చెయ్యి,'' అన్నది కేశవతి.

కాంచనుడు పెద్ద సీసా పైకి తీసి, దాని నుంచి ఒక చుక్క ద్రవం చేప మధ్య ఉన్న రంధ్రంలో వేశాడు. చేప దానంతట అదే తొట్టెలో అటూ ఇటూ తిరగనారంభించింది. అందరూ ఎంతో ఆనందించారు.

కేశవతి ఆనందంతో చిరునవ్వు నవ్వుతూ, ''అయితే, ఇప్పుడు నేను ఏం చెయ్యాలంటావు?'' అని కాంచనుణ్ణి అడిగింది.

''ఈ సీసాలో ఉన్న అద్భుత ద్రవం మహిమవల్లనే చేప ఈదింది. నేను నిన్ను కోరేదేమంటే, ఈ అద్భుత ద్రవాన్ని నిత్యమూ నువ్వు తలకు పూసుకోవాలి. ఈ సీసా అయిపోగానే మరొక సీసా పంపిస్తాను, సరేనా?'' అన్నాడు కాంచనుడు.

''అలాగే పూసుకుంటాను,'' అన్నది కేశవతి.

రాజూ, రాణీ నవ్వుతూ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ఆ సీసాలోది సువాసన చేర్చిన కొబ్బరినూనె అని వారికి తెలుసు. ఆ కొబ్బరి నూనె చుక్కే కాగితం చేపను అలా కదిలేటట్టు చేసింది.








ఆర్య ప్రధాన సలహాదారు ప్రభాత్-తూరుపు ప్రాంతంలో పసిపిల్లలు కనిపించకుండా పోవడం గురించి దర్యాప్తు జరపడానికి వెళ్ళాడు. అయితే, ఆ పనిమీద ఆర్య స్వయంగా వెళ్ళాలని ముని ఆదేశించాడు.













ముని మాటలు ఆర్యలో ఆందోళన రేకెత్తించాయి. స్వప్నంలోని బొంతకాకి వాడిగోళ్ళు ఆయన మనసులో కలవరం పుట్టించాయి.
సుకన్యా, నేను త్వరలో ప్రయాణానికి సిద్ధం కావాలి.
ఎంత వరకు?
తూరుపు ప్రాంతానికి. అయితే, ఈ విషయం ఎవరికీ తెలియకూడదు.
ఎందుకో తెలుసుకోవచ్చా?
నా విధిని వెతుక్కుంటూ వెళుతున్నాను.
నేనూ మీతో రావచ్చా?
నువ్వు శాంతిపురిలోనే ఉండాలి రాణీ! రాజ్యం నీ పర్యవేక్షణలో ఉండాలి.
హఠాత్తుగా బొంతకాకి చిట్టెలుకను తన్నుకుని రాజ మందిరంలోకి జొరబడింది.


చిన్నప్పుడు నువ్వు విన్న కథలు నీకు గుర్తున్నాయా రాణీ! చచ్చిన ఎలుక ఎగిరే రోజు...
...సువర్ణ ద్వీపం పైకి వస్తుంది!
దీనికంతా అర్థం ఏమిటి?
ఇది హెచ్చరికా? బెదిరింపా?
అది కేవలం సామెత మాత్రమే కదా? సువర్ణ ద్వీపం అసలు లేదు కదా?
ఉండవచ్చు. మనం దాని కోసం వెతక లేదు కదా?

అక్కడ ప్రభాత్ రాజప్రతినిధితో విచారణ కొనసాగించాడు.

అంటే, మీరలాంటి మృగాన్ని చూడలేదంటారు?

మేము పన్నెండు తోడేళ్ళను చంపాము. అయినా, పిల్లలు ఇంకా కనిపించకుండా పోతూనే ఉన్నారు.

మీ వేటగాళ్ళకు పట్టుబడకుండా తప్పించుకుంటున్నదంటే, అది మామూలు తోడేలు కాదని తెలిసిపోతున్నది కదా?

అంటే, అది మాయామృగమని తమరు చెబుతున్నారా? అది శూన్యం నుంచే పుట్టుకువస్తుందా?

నీకు మాయాజాలంలో నమ్మకం లేదా?

మాయలు, మంత్రాలు అన్నవి భయంతో బతికే మనుషులకే!

బహుశా, మేము దాని కోసం వెతకలేదు.

తమ చుట్టూ ఉన్న రాయిరప్పల కవతల చూడలేని మర్త్యులకు మాత్రమే భయమన్నది ఉంటుంది.

(ఇంకా ఉంది)

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

Because stories make the world go round...

**Choose** your Chandamama!
Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!
Subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..................................................

Date of Birth: .................... Sex :....................

Address: ..................................................

..................................................

..................................................

.................................... City: ....................

State:.................... Pin:....................

Telephone:..................................................

Mobile:..................................................

Email:..................................................

Subscription Number 9for renewals):....................

Gift Subscription to the following address:

..................................................

..................................................

..................................................

..................................................

Enclosed Cheque/DD* for Rupees....................

Cheque/DD No ....................

favouring Chandamama India Ltd on....................

..................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు జూలై 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513**, సందీప్ అవెన్యూ ఎక్స్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగ్కరై, చెన్నయ్ - **600 041**

## అభినందనలు

వై. శ్రీనివాస్ జయంత్,
తం.పే: వై. లక్ష్మీనారాయణ,
18-1-46/ఎం3, శాంతినగర్,
ఖాదీకాలనీ, కె.టి.రోడ్,
తిరుపతి-517501
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో:
విందుకోసం కాచుకున్నా!
రెండవ ఫోటో:
అందుకేగా వండుతున్నా!!

## మనదేశం క్విజ్ సమాధానాలు

1. 1921,బొంబాయిలో 2. 1934-35, ఉత్తర భారతదేశాన్ని బొంబాయి ఓడించింది 3. మహారాజా కె.ఎస్.రంజీ సింజీ 1896లో 4. కొల్‌కతా మొహమ్మదన్ స్పోర్టింగ్, రాయల్ వార్‌విక్‌షైర్ రెజిమెంట్‌ను ఓడించింది1940లో 5. 1951లో ఢిల్లీలో. 6. 1951లో న్యూ ఢిల్లీలో, ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ 7. ఇండియాకు చెందిన ధ్యాన్‌చంద్ 8. పి.కె.బెనర్జీ ఫుట్‌బాలర్ 1961లో.

**Printed and Published by L. Subramanyan at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,**
JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : L. Subramanyan**

# IPL 2009 Schedule




| Date | Matches |
|---|---|
| April 18 | Rajasthan Royals vs Bangalore Royal Challengers Mumbai Indians vs Chennai Super Kings |
| April 19 | Kolkata Knight Riders vs Deccan Chargers; Delhi Daredevils vs Kings XI Punjab |
| April 20 | Bangalore Royal Challengers vs Chennai Super Kings |
| April 21 | Rajasthan Royals vs Mumbai Indians; Kolkata Knight Riders v Kings XI Punjab |
| April 22 | Delhi Daredevils vs Chennai Super Kings; Bangalore Royal Challengers vs Deccan Chargers |
| April 23 | Kolkata Knight Riders vs Rajasthan Royals |
| April 24 | Kings XI Punjab vs Bangalore Royal Challengers |
| April 25 | Kolkata Knight Riders vs Chennai Super Kings; Deccan Chargers vs Mumbai Indians |
| April 26 | Rajasthan Royals vs Kings XI Punjab; Bangalore Royal Challengers vs Delhi Daredevils |
| April 27 | Kolkata Knight Riders vs Mumbai Indians; Chennai Super Kings vs Deccan Chargers |
| April 28 | Delhi Daredevils vs Rajasthan Royals |
| April 29 | Mumbai Indians vs Kings XI Punjab; Kolkata Knight Riders vs Bangalore Royal Challengers |
| April 30 | Delhi Daredevils vs Deccan Chargers; Rajasthan Royals vs Chennai Super Kings |
| May 1 | Bangalore Royal Challengers vs Kings XI Punjab; Mumbai Indians vs Kolkata Knight Riders |
| May 2 | Rajasthan Royals vs Deccan Chargers; Chennai Super Kings vs Delhi Daredevils |
| May 3 | Mumbai Indians vs Bangalore Royal Challengers; Kings XI Punjab vs Kolkata Knight Riders |
| May 4 | Deccan Chargers vs Chennai Super Kings |
| May 5 | Delhi Daredevils vs Kolkata Knight Riders; Kings XI Punjab vs Rajasthan Royals |
| May 6 | Mumbai Indians vs Deccan Chargers |
| May 7 | Kings XI Punjab vs Chennai Super Kings; Bangalore Royal Challengers vs Rajasthan Royals |
| May 8 | Delhi Daredevils vs Mumbai Indians |
| May 9 | Deccan Chargers vs Kings XI Punjab; Chennai Super Kings vs Rajasthan Royals |
| May 10 | Kolkata Knight Riders vs Delhi Daredevils; Bangalore Royal Challengers vs Mumbai Indians |
| May 11 | Bloemfontein Deccan Chargers vs Rajasthan Royals |
| May 12 | Bangalore Royal Challengers vs Kolkata Knight Riders; Kings XI Punjab vs Mumbai Indians |
| May 13 | Deccan Chargers vs Delhi Daredevils |
| May 14 | Mumbai Indians vs Rajasthan Royals; Chennai Super Kings vs Bangalore Royal Challengers |
| May 15 | Kimberley Kings XI Punjab vs Delhi Daredevils |
| May 16 | Chennai Super Kings vs Mumbai Indians; Deccan Chargers vs Kolkata Knight Riders |
| May 17 | Rajasthan Royals vs Delhi Daredevils; Kings XI Punjab vs Deccan Chargers |
| May 18 | Chennai Super Kings vs Kolkata Knight Riders |
| May 19 | Delhi Daredevils vs Bangalore Royal Challengers |
| May 20 | Chennai Super Kings vs Kings XI Punjab; Rajasthan Royals vs Kolkata Knight Riders |
| May 21 | Deccan Chargers vs Bangalore Royal Challengers; Mumbai Indians vs Delhi Daredevils |
| May 22 | Semifinal 1: ____________ vs ____________ |
| May 23 | Semifinal 2: ____________ vs ____________ |
| May 24 | Finals: ____________ vs ____________ |





## నిబంధనలు

నాణాన్ని టాస్ వేసి మొదట ఎవరు పాచిక వేయాలో నిర్ణయించండి.

| మీరు వేసింది... | |
|---|---|
| 1 లేదా 3 | (వేసినదాన్ని బట్టి) 1 లేదా 3 బ్లాకులు మూవ్ చెయ్యండి. స్ట్రైక్ మారుతుంది. అంటే-పాచికను మరో ప్లేయర్‌కి ఇవ్వాలి. |
| 2, 4 లేదా 6 | (వేసిన దాన్ని బట్టి) 2, 4 లేదా 6 బ్లాకులు మూవ్ చెయ్యండి. రీటైన్ స్ట్రైక్ అంటే మళ్ళీ త్రో చెయ్యాలి. |
| 5 | వేసినది చెల్లదు. |
| మీ నాణెం లోపల పడినట్టయితే | |
| ఔట్ బాక్స్ | ఎరుపు రంగు చదరపు గడి బ్లాక్ నంబర్‌లోకి మూవ్ కండి. |
| డిస్టర్‌బెన్స్ బాక్స్ | సూచనలకు కీ రెఫర్ చెయ్యండి. |
| క్వెశ్చన్ బాక్స్ | ప్రత్యర్థులు ఎరుపురంగు గడిలోని క్వశ్చన్ నంబర్‌ను చూసి దానికి సంబంధించిన ప్రశ్నను(కింద ఇవ్వబడి ఉన్నది) ప్లేయర్‌ని అడగాలి. సమాధానం సరైనదైతే 6 బ్లాకులు ముందుకు వెళ్ళాలి. సమాధానం తప్పయితే 6 బ్లాకులు వెనక్కు వెళ్ళాలి. |
| ఔట్ బాక్స్ 11 సార్లకు | మీరు గేమ్ నుంచి ఔట్ అన్నమాట. |



| | | | | | |
|---|---|---|---|---|---|
| 400 | 352 | 398 | 397 | 396 | 395 |
| 361 | 362 | 325 | 364 | 365 | 366 |
| 360 | 359 | 358 | 357 | 206 | 355 |
| 321 | 322 | 11 | 324 | 325 | 32 |
| 320 | 319 | 318 | 317 | 316 | 31 |
| 268 | 282 | 283 | 284 | 249 | 28 |
| 280 | 279 | 278 | 277 | 276 | 27 |
| 241 | 242 | 243 | 244 | 245 | 24 |
| 240 | 239 | 8 | 237 | 236 | 235 |

చం

# ందమామ ఘుర్కా
# ్వెంటీ-20 క్రికెట్








To download the boardgame, go to www.chandamama.com/cricket

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 95 | 394 | 393 | 212 | 391 | 390 | 389 | 388 | 387 | 12 | 385 | 384 | 383 | 382 | 381 |
| 66 | 367 | 368 | 369 | 370 | 371 | 372 | 373 | 374 | 375 | 376 | 377 | 378 | 309 | 380 |
| 55 | 354 | 353 | 352 | 351 | 350 | 195 | 348 | 347 | 346 | 345 | 344 | 343 | 342 | 341 |
| 26 | 10 | 328 | 329 | 330 | 331 | 332 | 333 | 334 | 335 | 336 | 337 | 11 | 339 | 340 |
| 15 | 314 | 313 | 312 | 311 | 73 | 309 | 308 | 307 | 306 | 305 | 304 | 303 | 302 | |
| 86 | 287 | 288 | 289 | 290 | 291 | 292 | 293 | 294 | 144 | 296 | 297 | 298 | 299 | 300 |
| 75 | 274 | 273 | 9 | 271 | 270 | 269 | 268 | 267 | 266 | 265 | 264 | 3 | 262 | 261 |
| 46 | | 248 | 249 | 250 | 251 | 252 | | 254 | 255 | 256 | 257 | 258 | 259 | 248 |
| 35 | 234 | 233 | 232 | 216 | 230 | 229 | 228 | 227 | 226 | 225 | 7 | 223 | 222 | 221 |

యురేకా

# సోలార్ వాటర్ ప్యూరిఫైయర్



మీరే సొంతంగా వాటర్ ప్యూరిఫైయర్ తయారు చేసుకోవచ్చు!

ఏ మేం కావాలి? ఒక వెడల్పాటి పాత్ర, చిన్న శుభ్రమైన గాజుకప్పు(పాత్ర అంచులకన్నా ఇది కురచగా ఉండాలి), ప్లాస్టిక్ ర్యాప్(సాండ్విచెస్ చుట్టడానికి ఉపయోగించేది), సెలోఫేన్ టేప్, ఉప్పు, నీళ్ళు, గాజు గోలీ లేదా నాణెం.

తయారు చేయడం ఎలా?

● రెండు గ్లాసుల నీళ్ళలో ఒక స్పూను ఉప్పు కలిపి అది పూర్తిగా కరిగిపోయేంత వరకు కలియదీయండి.

● ఈ నీటిని పాత్రలో పోసి, నీళ్ళ మధ్యలో కప్పును ఉంచండి.(ఉప్పు నీటి మట్టానికన్నా కప్పు ఎత్తులో ఉండాలి.)

● ప్లాస్టిక్ ర్యాప్‌తో పాత్రను పూర్తిగా చుట్టేసి టేప్‌తో సీల్ చేయండి. గట్టిగా సీల్ చేయడం చాలా ముఖ్యం.

● కింద ఉన్న గాజు కప్పుకు మధ్యలో వచ్చేలా ప్లాస్టిక్ ర్యాప్ మీద బరువు కోసం గాజు గోలీని గానీ, నాణేన్ని గానీ ఉంచండి. ఆవిరయ్యే నీటిని సేకరించడానికి ఇది ఉపయోగపడుతుంది.

● ఇప్పుడు మొత్తంగా పాత్రను తీసుకెళ్ళి ఎండలో ఉంచండి. ఎంత ఎక్కువసేపు ఉంచితే అంత మంచిది. మీకు ఓపిక ఉన్నట్టయితే రోజంతా కూడా ఉంచవచ్చు!



● ఆ తరవాత తెరిచి చూశారంటే కప్పులో నీళ్ళు చేరి ఉంటాయి.

● నీళ్ళను రుచి చూడండి... ఉప్పగా ఉందా? లేదు కదూ! సముద్ర జలంతో కూడా ఈ రకం ప్యూరిఫికేషన్ ప్రయత్నించి చూడవచ్చు. ఇది ఎలా జరుగుతుంది?

**కాన్సెప్ట్:** ఈ సోలార్ ప్యూరిఫైయర్ వెనక ఉన్న ఆధార సూత్రం–బాష్పీభవనం–ద్రవీభవనం. ఉప్పునీళ్ళను ఎండలో ఉంచినప్పుడు ఆవిరవుతాయి. నీళ్ళు ఆవిరై, ఉప్పు పాత్రలో అడుగున ఘనీభవిస్తుంది. నీటి ఆవిరి ప్లాస్టిక్ ర్యాప్‌ను చేరి ద్రవీభవనం చెంది నీటిబిందువులుగా మారుతుంది. ఈ నీటిబిందువులు బరువుకేసి లాగబడి మెల్ల మెల్లగా కప్పులోకి సేకరించ బడతాయి.

మన వారసత్వ స్థలాలు

# మహాబోధి దేవాలయ ప్రాంగణం




బీహార్‌లోని మహాబోధి(బుద్ధగయ) ఆలయం, మనదేశంలో ఇటుకలతో నిర్మించబడిన అతి ప్రాచీనమైన బౌద్ధ ఆలయాలలో ప్రధానమైనది. మొదటి ఆలయాన్ని క్రీ.పూ.మూడవ శతాబ్దంలో అశోక చక్రవర్తి నిర్మించాడు. ఇప్పుడున్న దేవాలయం క్రీ.శ.ఐదారు శతాబ్దాలలో నిర్మించబడి ఉండవచ్చని భావించబడుతోంది. బుద్ధుడికిక్కడే జ్ఞానోదయం కావడం వల్ల ఇది బౌద్ధుల ప్రధాన యాత్రాస్థలంగా ప్రసిద్ధిగాంచింది.

నలభైఐదు చదరపు మీటర్ల విస్తీర్ణంలో ప్రధాన ఆలయ పీఠం విస్తరించి ఉన్నది. ఆలయానికి వెలుపల బుద్ధుడి జీవిత ఘట్టాలు ఇటుకలతో అందంగా మలచబడి ఉన్నాయి. ఆలయం లోపల కుడిచేత్తో నేలను తాకుతూన్న భంగిమలో బ్రహ్మాండమైన బుద్ధుడి విగ్రహం ప్రతిష్ఠించబడి ఉన్నది. ఈ భంగిమలో ఉన్నప్పుడే ఆయనకు జ్ఞానోదయం అయిందని చెబుతారు. విగ్రహం నల్లరాతితో మలచబడిందేగాని, దానికి బంగారు రేకుతో తాపడం చేసి కాషాయాంబరాలు కట్టబడి ఉన్నాయి.

ఆలయ ప్రాంగణంలో వందల సంవత్సరాల నాటి చిన్న చిన్న స్థూపాలు, బుద్ధ విగ్రహాలు చాలా ఉన్నాయి. ఆలయం పక్కనే బోధివృక్షం ఉన్నది. బోధివృక్షం కింద కూర్చుని ధ్యాన నిమగ్నుడై ఉన్నప్పుడే బుద్ధుడికి జ్ఞానోదయమయింది. ఆ బోధివృక్ష సంతతికి చెందినదే ఇప్పుడున్న వృక్షం అని చెబుతారు. జ్ఞానోదయమయ్యాక బుద్ధుడు ఏడు రోజులపాటు నడుస్తూ ధ్యానం అభ్యసించిన చోటు కూడా ఇక్కడే ఉన్నది.

మహాబోధి ఆలయాన్ని 2002లో యునెస్కో ప్రపంచ వారసత్వ స్థలాల జాబితాలోకి తీసుకున్నది.

### అక్కడికి చేరుకోవడం ఎలా?

విమానం ద్వారా : గయ విమానాశ్రయం(4కి.మీ.); పాట్నా విమానాశ్రయం(135కి.మీ.).

రైలు మార్గం : గయ రైల్వేస్టేషన్(17కి.మీ.).

రోడ్డు మార్గం : గయ, పాట్నా, వారణాసి నుంచి బస్సుల రాకపోకలు ఉన్నాయి.

తాజ్‌మహల్ ఎక్కడ ఉన్నది?
a.ఢిల్లీ b.ఆగ్రా
మీ సమాధానాన్ని CIHQ
<space><a\b\>
54646కు SMS చెయ్యండి.
మరియు మీ మొబైల్లో
ఇండియన్ హెరిటేజ్ క్విజ్
ఆడుకోండి.

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 235 | 234 | 233 | 232 | 215 | 230 | 229 | 228 | 227 | 226 | 225 | 7 | 223 | 222 | 221 |
| 206 | 207 | 208 | 209 | 210 | 211 | 212 | 213 | 214 | 215 | 216 | 217 | 218 | 219 | 220 |
| 195 | 194 | 193 | 6 | 191 | 190 | 189 | 188 | 187 | 186 | 185 | 184 | 183 | 182 | 181 |
| 126 | 167 | 168 | 169 | 170 | 171 | 172 | 2 | 174 | 175 | 176 | 177 | 153 | 179 | 180 |
| 155 | 154 | 153 | 152 | 151 | 150 | 149 | 148 | 147 | 146 | 145 | 144 | 143 | 142 | 141 |
| 126 | 127 | 128 | 129 | 51 | 131 | 132 | 133 | 134 | 5 | 136 | 137 | 138 | 139 | 66 |
| 115 | 114 | 113 | 112 | 111 | 110 | 109 | 108 | 107 | 106 | 105 | 104 | 103 | 102 | 101 |
| 86 | 31 | 88 | 89 | 90 | 91 | 92 | 3 | 94 | 95 | 96 | 97 | 6 | 99 | 100 |
| 75 | 74 | 73 | 72 | 71 | 70 | 69 | 68 | 67 | 66 | 65 | 64 | 63 | 62 | 61 |
| 44 | 47 | 48 | 49 | 50 | 51 | 52 | 53 | 54 | 55 | 56 | 57 | 58 | 2 | 60 |
| 35 | 34 | 33 | 32 | 31 | 30 | 29 | 28 | 27 | 15 | 25 | 24 | 23 | 22 | 21 |
| 6 | 7 | 2 | 9 | 10 | 11 | 12 | | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 10 |

| | |
|---|---|
| ఔట్ బాక్స్ 11 సార్లకు ఎక్కువ అయితే | మీరు గేమ్ నుంచి ఔట్ అన్నమాట. |

మొదట ట్రోఫీని చేరుకున్న ప్లేయర్ గేమ్ గెలుపొందుతాడు.

ప్రశ్నలు:

1. చెన్నయ్ సూపర్ కింగ్స్ టీమ్ హెడ్‌కోచ్ ఎవరు?
2. ఐపిఎల్ 2009లో ఒక టీమ్‌లో అనుమతించబడే ఇంటర్నేషనల్ ప్లేయర్స్ సంఖ్య .........నుంచి..........కి పెంచబడింది?
3. సుదర్శన్‌చక్ర లోగోగా గల టీమ్ ఏది?
4. ఐకాన్ ప్లేయర్స్ లేని మూడు టీమ్‌లు ఏవి?
5. కొల్‌కతా నైట్ రైడర్స్ మస్కట్ ............... అనే బెంగాల్ టైగర్.
6. కింగ్స్ XI పంజాబ్ హోమ్ గ్రౌండ్.............
7. 'ధక్కత్ గీతే' ఏ టీమ్ థీమ్ సాంగ్?
8. టీవీ ట్యాలెంట్ షో ద్వారా చీయర్ లీడర్స్‌ను ఎంపిక చేసిన ఐపిఎల్ మొదటి టీమ్ ఏది?
9. రిలయన్స్ ఇండస్ట్రీస్ సొంతంగా గల టీమ్ ఏది?
10. ఆస్ట్రేలియాలో నైపుణ్యం కనబరచే క్రీడాకారులను తీసుకోవడానికి డొమెస్టిక్ మ్యాచెస్‌కు స్కౌట్స్‌ను పంపిన టీమ్ ఏది?
11. రాజస్థాన్ రాయల్స్ అధికారిక స్పోర్ట్స్ స్పాన్సర్ ఎవరు?
12. ఐపిఎల్ 2008లో విన్నింగ్ రన్స్ ఇన్ ది ఫైనల్స్ స్కోర్ చేసిన ప్లేయర్ ఎవరు?

(సమాధానాలు 55వ పేజీలో)

కీ:



మిస్ ఎ టర్న్

ఎరుపు రంగు గడిలో సూచించిన బ్లాక్ నంబర్‌కు మూవ్ కండి





| | | | | | |
|---|---|---|---|---|---|
| 240 | 239 | 8 | 237 | 236 | 23 |
| 201 | 202 | 203 | 204 | 205 | 20 |
| 200 | 199 | 198 | 197 | 196 | 19 |
| 49 | 162 | 163 | 164 | 165 | 126 |
| 160 | 159 | 158 | 30 | 156 | 15 |
| 121 | 122 | 123 | 124 | 125 | 12 |
| 120 | 119 | 118 | 12 | 116 | 11 |
| 81 | 4 | 83 | 84 | 85 | 86 |
| 80 | 79 | 78 | 77 | 76 | 75 |
| 41 | 31 | 43 | 44 | 45 | 44 |
| 40 | 39 | 38 | 1 | 36 | 35 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |


జెన్నిఫర్ ఫిగెట్

## ఈత

జెన్నిఫర్ ఫిగెట్(56) అట్లాంటిక్ మహాసముద్రంలో 24 రోజుల పాటు 3000 కి.మీ. దూరం ఈది, అలా ఈదిన తొలి మహిళగా పేరు తెచ్చుకున్నది. జనవరి 9వ తేదీ పశ్చిమ ఆఫ్రికాలోని కేప్ వెర్డేలో ఆమె నీళ్ళలోకి దిగింది. ఆ సమయంలో అలలు 9మీ. ఎత్తుకు లేస్తున్నాయి. 3000 కి.మీ. ఈది ట్రినడాడ్‌ను చేరుకున్నది. ఆమె మొదట 3,380 కి.మీ. దూరంలోని బహామాస్ చేరాలని ఆశించింది. భయంకరమైన సొరచేపల ప్రమాదం బారి నుంచి తప్పించుకోవడానికి, జెన్నిఫర్ తనను వెన్నంటి వచ్చిన పడవ పర్యవేక్షణలో కేజ్‌లో ఈదుతూ వెళ్ళింది. ఈతకు అంతరాయం కలగకుండా పడవ నుంచి ఆమెకు కావలసిన ఆహార పానీయాలు అందించారు. రోజుకు ఆమె ఎనిమిది గంటలపాటు ఈదేది.

## చదరంగం


హెతుల్ షా

తొమ్మిదేళ్ళ హెతుల్ షా గ్రాండ్ మాస్టర్ సాధించిన అతి పిన్న వయసు చదరంగం క్రీడాకారుడన్న విషయాన్ని ఆలిండియా చెస్ ఫెడరేషన్‌కు, ఇంటర్నేషనల్ చెస్ ఫెడరేషన్(ఎఫ్ఐడిఇ) ధ్రువపరచింది! జనవరిలో న్యూఢిల్లీలో జరిగిన పార్శ్వనాథ్ ఇంటర్నేషనల్ ఓపెన్ చెస్ టోర్నమెంటులో హెతుల్ 44 మూవ్స్‌లో కజకస్థాన్‌కు చెందిన మర్లాన్ ఐబ్రయేవ్‌ను దిగ్భ్రాంత పరచి దీనిని సాధించాడు. అప్పుడు హెతుల్ ర్యాంకు 1817; ఐబ్రయేవ్ 600 ర్యాంకుల ఆధిక్యతలో ఉండేవాడు. 2004లో జరిగిన బీయిల్ మాస్టర్స్‌లో స్విట్జర్లాండ్‌కు చెందిన జి.యం.నిమెట్‌ను అధిగమించిన ఢిల్లీకి చెందిన పరిమరాజన్ నేగి రికార్డును బద్దలు కొట్టాడు. అప్పుడతడి వయసు పదకొండేళ్ళు.

CHANDAMAMA (Telugu) May 2009 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11






# బుబ్బా సాహసాలు




కపిల్ అతడి స్నేహితులు పర్వతారోహణకు బయలుదేరారు. వీపు మీద బ్యాగ్స్‌తో వాళ్లు నడుస్తూండగా..

మనం ముందుకు వెళ్లాలి.. ఆగకండి.

నేను అలిసిపోయానే.. కాస్సేపు విశ్రాంతి తీసుకుందాం..

సునీత ఒక బండ మీద కూర్చున్నది. కపిల్ చిన్నగా నవ్వుతూ సరేనన్నాడు.

సరే... ఐదు నిమిషాలు మాత్రమే....

రోనక్ ఫోటోలు తీయడం మొదలు పెట్టాడు.

అదిగో అక్కడ చూడండి.. పీచ్ చెట్లు. చాలా చాలా ఉన్నాయి.

అక్కడ చూడండి మామిడి చెట్లు.

వాటిలో కొన్నిటిని కోసుకుందాం. తరవాత తిందాం.

అవును, అవంటే నాకెంతో ఇష్టం.

ఆ తరవాత అందరూ కొండపైకి చేరుకున్నారు.

ఇప్పుడు తిందాం మామిడి-పీచ్ పళ్ళు...

వాళ్లు తినడానికి కూర్చోగానే...

చూడు కపిల్... ముందు తినడానికి ఏవి కావాలి?

నాకు రెండూ కావాలి!

రెండింటినీ ఒకేసారి ఎలా తింటావు? మరీనూ...

హఠాత్తుగా అక్కడ బుబ్బా ప్రత్యక్షమయ్యాడు. రెండు బుబ్బాలూ తీశాడు.

తప్పకుండా ఇప్పుడు తినవచ్చు.

బుబ్బాలూ మ్యాంగో పీచ్...

అందరూ ఒక్కటిగా కలిసి పెద్ద పెద్ద బబుల్స్ ఊదారు.

న్యూ బుబ్బాలూ మ్యాంగో పీచ్...

Bubbaloo